# సంపాదకీయం.....

సత్య ధర్మ శాంతి ప్రేమలు విశ్వశాంతికి మూలమంటూ, దివి నుండి భువికి దిగి వచ్చి, మానవాకారమును ధరించి, మానవాళిలో మరచిపోయిన ప్రేమ కరుణలను, మరుగుపడిన మానవత్వాన్ని మేల్కొల్పుతూ, మానవుని మాధవునిగా తీర్చిదిద్దేందుకు ఎనలేని కృషి సల్పుతున్నారు ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు.

భారతీయ సంస్కృతీ సనాతన ధర్మాలను గురించి పామరులకు సహితం అర్థమయ్యే రీతిలో బోధిస్తూ, మోసం, ద్వేషం, లసూయలకు ఆస్కారంలేని నవసమాజ నిర్మాణానికి నడుం బిగించారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. కులాలపేరుతో క్రుమ్ములాడుకుంటూ, మతాలపేరిట మారణహోమాలను సృష్టిస్తూ, స్వార్థ స్వప్రయోజనాలతో కల్లోలాలను పురి గొలుపుతూ, అరాచక అకృత్యాలకు ఏమాత్రం వెరువక, లోకంలో అశాంతిని నెలకొలుపుతున్న స్వార్థపరులను చూచి వ్యధ చెంది, "నా కులం... నా కులం... గంగదేకులం ? గాలిదే కులం ? నిప్పుదే కులం? వాటికి కులాలేలేవే ? మనదంతా ఒకటే కులం. అదే మానవకులం" అంటూ ప్రభోధిస్తూ "మతములన్నియు మంచినే బోధించె, తెలిసి మెలగవలయు తెలివితోడ. మతులు మంచివైన మతమేమి చెడ్డది ? అని చెబుతూ సర్వమత సమన్వయాన్ని ప్రచారం చేస్తున్నారు. సమైక్యతను సాధించడానికి కృషి చేస్తున్నారు భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారు.

విద్య ఖరీదైన ఈరోజులలో, విద్య పేదలకు అందుబాటులో లేని ఈతరుణంలో, ' మెరిట్ ' కు ఏమాత్రం విలువలేని ఈ సమయంలో, తానే విద్యాసంస్థలను నెలకొలిపి వేలాది మంది బాలబాలికలకు కె. జి. నుండి పి.జి. వరకు ఉచితంగా విద్యను అందిస్తూ, మెరిట్‌కు ప్రోత్సాహమిస్తున్నారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. సకాలంలో సరియైన వైద్యం లభించక, ఒకవేళ లభించినా ఆర్థిక స్తోమత లేక ఎందరో బీదలు, పేదలు కన్ను మూస్తున్న ఈ తరుణంలో, రు 300 కోట్లు ఖర్చు చేసి పుట్టపర్తిలో, రు 500 కోట్లు వెచ్చించి బెంగుళూరు (త్వరలో ప్రారంభంకానున్నది ) లోను సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులను నిర్మాణంచేసి ఎందరో అభాగ్యులను ఆదుకుంటున్నారు, ప్రాణభిక్ష పెడుతున్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

మంచినీరు దొరకక అలమటిస్తున్న రాయలసీమవాసులకు, మహబూబ్ నగర్ జిల్లా ప్రజలకు కొన్ని వందలకోట్లరూపాయలు వెచ్చించి లక్షలాది మంది ప్రజల దాహార్తిని తీర్చిన అపరభగీరధుడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. గ్రామసేవే రామసేవని తన విద్యార్థులకు, అధ్యాపకులకు ప్రబోధించి, వారిని, ప్రోత్సహించి, 15రోజులపాటు వందలాది గ్రామాలకు పంపి లక్షల సంఖ్యలో ఆహారపొట్లాలను, వస్త్రాలను అందింపజేసిన స్వార్థమెరుగని వితరణశీలి భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. పాశ్చాత్య వ్యామోహంలో పడి, భారతీయ శాస్త్రీయ సంగీత సాహిత్య, నృత్యకళలు మరియు గ్రామీణ జానపద కళలు అడుగునపడి అంతరించిపోతున్న ఈ తరుణంలో, వాటిని పునరుద్ధరించాలని సంకల్పించుకొని కొన్ని కోట్ల రూపాయిలు వెచ్చించి, సంగీత కళాశాలను పుట్టపర్తిలో నెలకొలిపారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ప్రేమతత్వము, మానవత్వం మానవాళిలో పెంపొందించటమే భగవాన్ సాయి లక్ష్యం. సర్వమతసమన్వయమే సాయిధ్యేయం, సమసమాజనిర్మాణమే సాయీ పరమావధి. బీద, పేద ప్రజల సముద్ధరణే సాయి ఆశయం. అందువలననే విశ్వకళ్యాణానికై, అహర్నిశలు కృషి చేస్తున్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు.

ఈనాడు ఆ ప్రేమమూర్తిని సందర్శించడానికి, ఆ కరుణామూర్తిని తిలకించడానికి, మానవత్వం మూర్తీభవించిన ఆ మానవతావాదిని దర్శించుకోవడానికి, ఆ దివ్యశక్తిని కళ్ళారా చూచి తరించడానికి ప్రపంచం నలుమూలలనుండి లక్షలాది మంది వస్తున్నారు. వేలకోట్లరూపాయిలు సమర్పించుకుంటున్నారు. కుగ్రామమైన పుట్టపర్తి ఈనాడు ఒక బుల్లి ప్రపంచము (Mini World) గా రూపొందింది. కుల, మత, భాషా, ప్రాంత భేదాలను విస్మరించి సాయిరాం। సాయిరాం। అంటూ ప్రేమతో పలుకరించుకుంటున్నారు. అంతేకాదు, విదేశీవనితలు సహితం తమ ఆచారవ్యవహారాలను కూడా ప్రక్కనపెట్టి భారతీయ స్త్రీలవలె చీరెలు కట్టుకొని, తిరుగుతుంటే ఎవరు విదేశీవనితలో తెలుసుకోలేని స్థితి ఈనాడు మనకు అక్కడ గోచరిస్తుంది. తెలుగులోనున్న సాయి నామసంకీర్తనలు విదేశీయులు కూడా చాలా స్పష్టంగా పాడుతున్నారు. ఇటువంటి సమైక్యతను, సమత్వాన్ని, సమభావాన్ని సాధించింది ఎవరు ? భగవాన్ శ్రీ సత్యసాయి కాదా। వసుధైక కుటుంబాన్ని గురించి మనం పురాణాలలో చదువుతున్నాం. ఈనాడు అట్టి వసుధైక కుటుంబాన్ని, ఆచరణలో మనం అక్కడ కళ్ళారా చూస్తున్నాం. దీనిని సాధించింది ఎవరు ? భగవాన్ బాబావారు కాదా। కుగ్రామమైన పుట్టపర్తి అంతటి మహాపట్నంగా విలసిల్లటం వలన తినటానికి కూడా తిండి సరీగా లేని వేలాదిమంది రైతులు ఈనాడు కోటీశ్వరులైనారు. బీదలు పేదలు ఎందరో కడుపునిండా అన్నం తింటున్నారు. వ్యాపారస్థులు ఎంతో సంపాదిస్తున్నారు. కార్మికులు, కూలీలకు పని దొరుకుతున్నది. వీరందరూ భారతీయులే గదా। ఎవరి వలన ఈ ఉన్నత స్థితి, ప్రగతి అక్కడ సాధించబడింది ? భగవాన్ సాయి వలన కాదా ? కనులకు కనిపిస్తున్న ఇలాంటి ప్రగతిని చూచి ప్రశంసించాల్సింది పోయి, కొందరు స్వార్థపరుల కట్టు కథలను ముద్రించి, 'ఇండియాటుడే' లాంటి ప్రముఖ పత్రిక ప్రచారం చేయటం కడు విచారకరం, అత్యంత శోచనీయం. ఇలాంటి అభూతకల్పనలను ప్రచారం చేయటం వలన ఆ పత్రిక స్థాయి దిగజారుతుందేగాని, ఏమాత్రం పెరగదు. భగవాన్ సాయి స్థాయి మాత్రం ఇంకా ఇనుమడిస్తుందేగాని ఏ మాత్రం తరగదు. ఈ వాస్తవాన్ని, ఈ సత్యాన్ని ఎంత త్వరగా గ్రహించుతే, అంత వారికే మంచిది.

"అందరినీ ప్రేమించండి। ప్రేమించటం చేతకాకపోతే దూషించకండి" అన్న భగవాన్ సాయి మాటలను స్మరించుకుందాం, మననం చేసుకుందాం, ఆచరణలో పెడుదాం. ఇదే ఈనాటి మన కర్తవ్యం.

మచిలీపట్నం,
ది 1-12-2000.

(కొమరగిరి కృష్ణమోహనరావు)
సంపాదకులు 'శ్రీవాణి'

డిశంబర్ 2000

సంపుటి 16 సంచిక 12



మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137



Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***


| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |


*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-12-2000**


# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు


## విషయసూచిక



ముఖచిత్రం

 **ఆదికవి నన్నయ** 



# నా ఆస్తి ప్రేమ ఒక్కటే

ప్రేమస్వరూపులారా!

ఏ మానవుడు, తన యందున్న ఆత్మ, పరుల యందున్నటువంటి ఆత్మ ఒక్కటేనని విశ్వసించునో, అట్టివాడు గృహస్థుడైనా, రక్తుడైనా, విరక్తుడైనా, అట్టి వానియందు భగవంతుడు నిరంతరమూ నివాసుడై ఉంటాడు. అట్టివాడే భగవంతుడుగా మారుతాడు. భగవంతుని తత్త్వమును అర్థంచేసుకోలేక అనేకమంది విమర్శిస్తుంటారు. విమర్శించే వారికన్నా, అర్థం చేసుకున్నవారు చాలా అదృష్టవంతులు.

'కోటీశ్వరునకైన కూడు గుడ్డయె గాని
బంగారమును తిని బ్రతుకలేడు'

మానవత్వంలో ఇది సమత్వమైన తత్త్వము.' దైవం అందరి యందునూ ఉంటున్నాడు. సత్యము నందును, అసత్యము నందును; ధర్మము నందును, అధర్మము నందును; పుణ్యము నందును పాపమునందును; భగవంతుడు సమత్వంగా ఉంటున్నాడు. ఇట్టి పవిత్రమైన ఏకత్వాన్ని గుర్తించుకొనే నిమిత్తమై, ప్రాచీనకాలము నుండి అనేకమంది ఋషులు అనేక ప్రయత్నములు, పరిశోధనలు జరుపుతూ వస్తున్నారు.

సృష్టి స్థితి, లయములతో ఈ జగత్తంతా నడుస్తున్నది. ఈ సత్యమును ఎవరూ కాదనలేరు. ఏ సైంటిస్టు దీనిని కాదని చెప్పలేడు. జగమంతా మనకు నిత్య భూతముగా కనిపిస్తునే ఉన్నది. సృష్టించినది పోషించబడుతున్నది, పోషించబడినటు వంటిది లయమైపోతున్నది. ఇది ప్రత్యక్ష ప్రమాణం. కనుక ఈ మూడువిధములైన సృష్టి కర్మలను మనం విచారణ చేసి, గుర్తించడానికి ప్రయత్నించినప్పుడు, దివ్యత్వం మనకు గోచరమవుతుంది. మానవత్వమునందున్న దివ్యత్వాన్ని, ప్రాకృతమైన అనుభూతులయందున్న దానిని మనం కొంత వరకు అవగాహన చేసుకొనవచ్చును. కాని అది దైవత్వమునకు మూలాధారం కాకపోయినప్పటికినీ, దైవత్వాన్ని నిరూపించే టటువంటి చిహ్నంగా రూపొందుతుంది. ఇప్పుడు లైన్స్ అంతా వచ్చాయి. కాని అది నిజమైనటువంటి లైన్స్ కాదు. కాని దీనిద్వారా నిజమైనటువంటి లైనును గుర్తించడానికి మనకు వీలుగలుగ జేస్తుంది. అదే పథముగనే ప్రపంచము నందున్నటువంటి ప్రతి పదార్థము కూడానూ, ప్రతి అనుభూతి కూడానూ దివ్యత్వాన్ని గుర్తింపజేస్తుంది. చెరకులోని తీపి, మిరపలోని కారము, చింతపండులోని పులుపు, వేపలోని చేదు - ఇవన్నీ భగవంతుని యొక్క చిత్ర, విచిత్రాలను గుర్తు చేస్తాయి.

ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకుగా వెలుగు తున్నాయి. తరంగములు కదులుతూ ఉన్నాయి. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు ఆనందాన్ని అందిస్తున్నాడు.

## భగవాన్ సాయి ఉద్బోధ

ఇవన్నీ భగవత్ తత్త్వమునకు నిదర్శనములు. భగవత్ తత్త్వమును అవి ప్రబోధిస్తున్నాయి. ప్రాపంచికవిషయాలలో ఒకడు విద్యాధికారిగా ఉంటాడు. రెండవవాడు రెవిన్యూ అధికారిగా ఉంటాడు. మూడవవాడు పోలీసు అధికారిగా ఉంటాడు. ఈ విధంగానే ఒక్కొక్క శాఖకు ఒక మంత్రిగా వుండి, అందరూ చేరి ప్రధానమంత్రికి ఆధీనులై వుండినట్లుగా, సృష్టికి బ్రహ్మ, రక్షణకు విష్ణువు, శిక్షణకు శివుడని పేర్లతో వారు కర్మలను ఆచరిస్తూ వస్తున్నారు. వీరందరికీ అధిపతి దైవమే. అతనినే ఒక్కొక్క మతం వారు ఒక్కొక్క పేరుతో పిలుస్తూ వస్తున్నారు. ఆయననే GOD అన్నారు. G.. O.. D.. 'G' అనగా Generation (సృష్టించటం) 'O' అనగా Organisation (పోషించటం) 'D' అనగా Destruction (నాశనంచేయటం), కనుక ఈ GOD లో కూడనూ సృష్టిస్థితి లయములు చేరి ఉంటున్నాయి. ఇట్టి దివ్యత్వాన్ని గుర్తించలేనటువంటివారు, ఇలాంటి లౌకికమైన ఆధారములు తీసుకొని దివ్యత్వాన్ని ప్రకటిస్తూ వస్తున్నారు. ఒకరు చెప్పినా, చెప్పకపోయినా సత్యము సత్యమే.

దైవము ఉన్నాడు. ఎక్కడ ఉన్నాడు? సర్వులయందునూ సర్వస్వరూపుడై ఉంటున్నాడు. మానవత్వములో వున్నటు వంటి దివ్యత్వము సర్వులకూ గోచరమవుతూనే ఉన్నది.

ఈనాడు ఇన్ని లక్షలమంది స్వామిని ప్రేమిస్తూ వచ్చారంటే, దీనికి ప్రేమయే ప్రధానమైన రూపము. అందరి హృదయాలలో నా లక్ష్యమును నింపుకుంటున్నారు. ఇంతకంటే ఆనందమైనది మరొకటిలేదు.

ప్రేమస్వరూపులారా!

ఆత్మ విశ్వాసమే శాశ్వతమైనటువంటి లక్షణం. కనుక మనం ఆత్మవిశ్వాసంతో ఏ పనులు చేసినప్పటికినీ, అంతా దిగ్విజయమవుతాయి, కనుక ఆత్మవిశ్వాసం ప్రతి మానవునికి అత్యవసరం. ఒకరి ప్రేమను మనం అందుకోవాలంటే, మనం మొట్టమొదట వారిని ప్రేమించాలి. ఇతరుల చేత మనం గౌరవించబడాలంటే, మనం మొట్టమొదట ఇతరులను గౌరవించాలి. మనం ఇతరులను గౌరవించక, మనల్ని ఇతరులు గౌరవించాలంటే ఇది అసాధ్యం. అదే విధముగనే మనం భగవంతుణ్ణి ప్రేమిస్తుంటే, భగవంతుడు మనల్ని ప్రేమిస్తాడు. కనుక జీవితమంతయూ Reaction, Reflection, Resound కనుక మనం అందర్ని ప్రేమించాలి. అప్పుడే మనం అందరి ప్రేమకు పాత్రులమవుతాం.

## ఉచితవిద్య

ప్రస్తుత విద్యావ్యవస్థలో వ్యాపారధోరణి పెరిగిపోతున్నందు వలన, దానిని అరికట్టేందుకు దేశ వ్యాప్తంగా ఉచిత విద్యను కల్పించాలని పుట్టపర్తిలో జరిగిన సత్యసాయి విశ్వవిద్యాలయ 19వ స్నాతకోత్సవ సభలో, ఛాన్సలర్ హోదాలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు కేంద్ర మానవ వనరుల శాఖామంత్రి శ్రీ మురళీమనోహర్ జోషీని కోరారు. ఈ విషయమును ప్రధానమంత్రికి తెలియజేసి అమలుకు కృషి చేయాలని విజ్ఞప్తి చేశారు. సత్యసాయి ట్రస్టు వారి చేత నిర్వహించబడుతున్న అన్ని విద్యాసంస్థలలో కె.జి. నుండి పి.జి. వరకు ఉచితంగా విద్యను అన్ని సౌకర్యాలను కల్పిస్తున్నట్లుగా వారు పేర్కొనినారు. నేడు అనేక విద్యా సంస్థలలో లక్ష్మీ దేవి తిష్టవేసిందని చెబుతూ అడ్మిషన్లనుంచి, పరీక్ష వ్రాసుకావడానికి కూడా ధనాన్ని వసూలు చేస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ఉచిత విద్యావిధానం వలన విద్యార్థులలో వ్యక్తిత్వ వికాసం ఎలా అభివృద్ధి చెందుతున్నదనడానికి తమ విద్యా సంస్థలే నిదర్శనమని బాబావారు స్పష్టం చేశారు.

అందరినీ మనం గౌరవించాలి. అప్పుడే మనల్ని అందరూ గౌరవిస్తారు. మనం దేనిని ఆశిస్తున్నామో, మొట్టమొదట దానిని మనం ఆచరించాలి. ఆచరించిన సర్వకర్మలకూ Reaction, Reflection, Resound ఉంటుంది. కనుక మొట్టమొదట నీవు ఇతరులను గౌరవించు. ఇతరులకు తగినటువంటి ప్రేమసందేశాన్ని అందించు. అప్పుడే నిన్ను ఇతరులు కూడా ప్రేమిస్తారు.

ప్రేమస్వరూపులారా!

ఈనాడు మీకు ఏమి చెప్పగలను. మీ అందరినీ చూస్తుంటే నా హృదయం ఎంతో ఆనందంతో నిండిపోతున్నది. ఇందరి ప్రేమకు నేను పాత్రుడనైనానంటే, నా ఆనందమునకు హద్దులు లేకుండా పోతున్నది. మిమ్ములను ఎవరినీ నేను ఆహ్వానించలేదు. కాని, నాయందున్న ప్రేమనే మిమ్ముల నందరినీఆహ్వానించింది. ఈ రెండూ కూడనూ దైవత్వానికి తగినటువంటి సందేశములే. 'సందేశం' అంటే ఏమి చెప్పాలి. నేను యివ్వటం, మీరు పుచ్చుకోవటం. మీరు యివ్వటం నేను పుచ్చుకోవటం. ఇచ్చి పుచ్చుకొనేటటువంటి సంబంధ బాంధవ్యమే మనది. 'సర్వభూతహితం ఏవామ్ ' మీరందరూ క్షేమంగా ఉండాలి, ఆనందంగా ఉండాలి, ఆధ్యాత్మిక తత్వాన్ని అభివృద్ధి పరచుకోవాలి. ఈ జగత్తును తిరిగి పునరుద్ధరించాలి.

ఈనాటి ప్రపంచ పరిస్థితులు చాలా అయోమయంగా ఉంటున్నాయి. ఎక్కడ చూచినా, ఎక్కడ విన్నా చాలా అశాంతిని అందించేటటువంటివే. దీనికి తగిన భద్రతను చేకూర్చాలి. అందరి యందున్నటువంటి దైవత్వం ఒక్కటేననే భావంతో మీరందరూ జీవితాన్ని గడపాలి. ఏవో కొన్ని శిక్షలు కలిపించే నిమిత్తమై సృష్టిస్తుంటాడు భగవంతుడు. ఇప్పుడు ప్రభుత్వం కూడా కొంతమంది పోలీసులను నియమించింది. మిలటరీని కూడా నియమించారు. వీరందరూ దేనికోసం? దేశ రక్షణకు. తప్పు చేసినవారిని శిక్షించుటకు. తాను తప్పుచేయకపోతే పోలీసులు కొట్టడానికే వీలులేదు. అదే విధముగనే భగవంతుడు కొన్ని శక్తులను జగత్తుకు అందించాడు. మంచి చేసినవారికి మంచి ఫలితములు అందించడం, చెడ్డచేసినవారికి చెడ్డ ఫలితములు అందించడం. ఇవి కర్మ ఫలితములుగా రూపొందింపజేసి వీటిని లోకమునకు అందించాడు. కాని మనం ఆ కర్మలను

దూషిస్తున్నాము. ఇది చాలా పొరపాటు. మనయందున్న దుష్కర్మలను దూరం చేసుకోవాలి. అపవిత్రమైన భావాలను దూరం చేయండి. దుర్భావములను దూరం చేయండి. అప్పుడు మిమ్ములను ఎవ్వరూ శిక్షించరు. మిమ్ములను శిక్షించేవారు కూడా వచ్చి రక్షిస్తారు. కనుక మనలో ఎట్టి దోషములూ లేకుండా ప్రయత్నించాలి.

ఆత్మ శాశ్వతమైనటువంటిది. అట్టి శాశ్వతమైనటు వంటి ఆత్మతత్వమునుంచి శాశ్వతమైన భావాలు మనలో ప్రవేశించాలి. ఈ జగత్తు యొక్క సృష్టి, ఈ జగత్తు యొక్క పాలన, సంరక్షణ - ఇవన్నీ భగవంతునియొక్క నియమములే. ఆ నియమముల ఆచరణ కూడా తనదే. 'సర్వభూతనిరంతానామ్' సర్వభూతములయందునూ తాను ప్రకాశిస్తున్నాడు. అలాంటి స్థితిలో మనం ఎవరిని దూషించాలి? ఎవరిని ఏవిధంగా పూజించాలి? ఆధ్యాత్మికం, నిన్ను నీవు విశ్వసించు! నిన్ను నీవు నమ్ము! అని బోధిస్తున్నది. అనగా నిన్ను నీవు తెలుసుకో! నీవు ఎవరు? అని ప్రశ్నించినపుడు, నీపేరుగాని, ఊరుగాని, నీవు చేసే పనిగాని చెప్పటం సరియైన సమాధానం కాదు. ఏది సరియైన సమాధానం? నీవు ఎవరవు? అన్నప్పుడు, నేను 'ఆత్మ' ను అని చెప్పాలి. అదే సరియైన సమాధానం. దేహం అనిత్యమైనటువంటిది. మనసు కూడా అనిత్యమైనదే. దేహమును నీవుగా భావించుకోవటం పొరపాటు. కనుక దేహ, మనసులను రెండింటిని త్యజించి, వీటికి శక్తి నిచ్చేటటువంటి ఆత్మ తత్వాన్ని నీవు గుర్తించడానికి ప్రయత్నించాలి. ప్రతివ్యక్తి ఆత్మస్వరూపుడే గాని, అన్యస్వరూపుడు కాదు. అతని స్వరూపమే సర్వత్రా వ్యాపించి ఉంటున్నది. కనుక "సర్వభూత తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినా భగవంతుని తిరస్కరించడమే అవుతుంది.

"సర్వ భూత నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవికి నమస్కారం చేసినా దైవమునకు నమస్కరించినట్లే అవుతుంది. ఎందుకంటే సర్వుల యందూ వున్నటు వంటి దైవత్వం ఒక్కటే. కనుక నీవూ నేను ఒక్కటేననే వాస్తవమును గుర్తించటమే సరియైన సత్యము. ఏ సాధనలు చేసినప్పటికినీ, తన యందున్నటువంటి సత్యాన్ని తాను గుర్తించుకొనే నిమిత్తమై చేసే కర్మలే.

ప్రతి మానవునికి జనన మరణములు ఉంటుంటాయి. ఈ రెండింటికి మధ్యలో జీవితమనేది ఒకటుంది. అది తరుగుతుంది, పెరుగుతుంది. కాని నిజమైన మానవత్వమనేది తరిగేది, పెరిగేది కాదు. మానవ ఆకారము ధరించినటు వంటి దేహము పెరుగుతుంది, తరుగుతుంది గాని, తాను తరగటం లేదు, పెరగటం లేదు. బాల్యమునందు అతనిని Child అన్నారు. యౌవనము నందు అతనిని Man అన్నారు. వార్ధక్యము నందు అతనిని Grand Father అన్నారు. అంతా ఒక్కటే. రూపాలు మారినాయి గాని, సంబంధాలు మారలేదు. అదే విధముగనే భగవంతుని యొక్క తత్వము కూడనూ రూపములు మారుతుండ వచ్చును గాని, భగవంతుని యొక్క శక్తి ఒక్కటే.

"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అట్టి సత్యాన్ని మీరు ఈనాడు గుర్తించాలి. అందరినీ గౌరవించాలి, ప్రేమించాలి. ఇటువంటి ఆనందాన్ని అందిస్తే నీవు దేవుడిగానే మారిపోతావు. అందరి యందునూ వున్నటువంటి ఆత్మ ఒక్కటేనని గుర్తించినప్పుడు ఎట్టి బేధములు రావు. కాని

## శ్రీ మురళీ మనోహర్ జోషి

"ఉచిత విద్య, ఉచిత ఆరోగ్య సదుపాయాలు లాంటివి ప్రభుత్వాలు చేయవలసిన పనులైనా, బాబావారే ఈ సౌకర్యాలను కలిపించటం ప్రశంసనీయం. అన్ని హంగులూ కలిగిన సంపన్న దేశాలలో ప్రజలు సుఖశాంతులతో లేరు. మన దేశంలో పేదరికం ఉన్నా, ఆధ్యాత్మిక చింతనలో ప్రజలు సంపన్నులుగా ఉన్నారు. ప్రపంచంలో అనేక మంది ప్రముఖ శాస్త్రవేత్తలు ఈనాడు ఆధ్యాత్మిక చింతన వైపు మొగ్గు చూపుతున్నారు. అందుకే మానవతావిలువలతో కూడిన విద్య ప్రస్తుతం చాలా అవసరం. ఇటువంటి పంథాలో సత్యసాయి విద్యా సంస్థలు నిర్వహించబడటం ప్రశంసనీయం. సత్యధర్మ శాంతి ప్రేమ అహింసల మార్గ దర్శకాలతో ముడిపడిన విద్యను సత్యసాయి విద్యా సంస్థలలో విద్యార్థులకు బోధించడం ఇక్కడి ప్రత్యేకతగా గమనించాను. అలాంటి విద్యావ్యాప్తి కోసం దేశంలోని ఇతర విద్యాసంస్థలు కూడా కృషి చేయాలి" అని కేంద్ర మానవ వనరుల శాఖామంత్రి శ్రీమురళీమనోహర్ జోషి, సత్యసాయి విశ్వవిద్యాలయ 19వ వార్షికోత్సవ సభలో ముఖ్యఅతిథిగా పాల్గొనిన సందర్భమున తన ప్రసంగంలో పేర్కొనినారు.

## మహబూబ్‌నగర్ సేవాదళ్ సేవలు

167 దేశాల నుంచి వచ్చిన లక్షలాది మంది భక్తులతో పుట్టపర్తి కిటకిటలాడిపోయింది ఎక్కడ చూచినా జనమే. ఆర్.టి.సి వారు 400 ప్రత్యేకమైన బస్సులను నడిపారు బెంగుళూరునుంచి సరాసరి పుట్టపర్తికి రైళ్ళు కూడా నడిపారు. చిన్నకార్లకు, వ్యాన్లకు లెక్కలేదు స్పెషల్ బస్సులు కూడా ఆంధ్ర, కర్ణాటక, కేరళ, తమిళనాడుల నుండి ఎన్నో వచ్చాయి. వచ్చే లక్షలాది మంది భక్తులకు సమాచారం అందించడానికి ప్రతి రాష్ట్రంవారు, విదేశాలవారు సమాచార కేంద్రములను ఏర్పాటు చేశారు. పోలీసు వారు 'May I help you' పేరిట బస్సుస్టాండ్‌లో ఒక సమాచార కేంద్రమును ఏర్పాటు చేయటం విశేషం.

వీటన్నింటికి మించిన మరో సేవ అక్కడకు వచ్చిన భక్తులందరిచేత ప్రశంసలనందుకొనినది కరువు జిల్లా అయిన మహబూబ్‌నగర్‌కు మంచినీటి వసతిని కలిపించిన భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారికి కృతజ్ఞతాపూర్వకంగా ఆ జిల్లాకు చెందిన సేవాదళ్‌వారు "శ్రీసత్యసాయి సుజల స్రవంతి పథకం" పేరిట వాటర్ కేన్లను తమ భుజాలకు తగిలించుకొని, విశ్శబ్దంగా భక్తుల దగ్గరకు వచ్చి అడుగుతూ మంచి నీరును అందించడం జరిగింది. ఈ విధంగా 350 మంది స్త్రీ పురుషులు వాటర్ కేన్లను తగిలించుకొని భక్తులందరికీ అన్ని వేళలా మంచినీరును అందించడం ఆ జిల్లా వారి ప్రత్యేకత.

ఇకపోతే అదే మహబూబ్‌నగర్ సేవాదళ్‌వారు 75 ట్రాలీలను తీసుకొని వచ్చి, బస్సుస్టాండులో దిగిన భక్తుల సామాన్లను, దాని మీద పెట్టుకొని, వారు ఉండే స్థలాలకు తీసుకొనివెళ్ళి, ఎవరి సామానులను వారికి భద్రంగా ఒప్పజెప్పడం అందరి భక్తుల ప్రశంసలందుకున్నది. మరల తిరిగి వెళ్లేటప్పుడు కూడా వారి సామాన్లను కూడా బస్సు స్టాండు వరకు చేర్చేవారు నయా పైసా కూడా తీసుకోకుండా ఈ సేవను వారు నిర్వహించారు. ఆ సేవలు నిర్వహించిన వారిలో ఎందరో విద్యావంతులు, మెడికల్, ఇంజనీరింగ్ విద్యార్థులు కూడా ఉండటం విశేషం ఈ రెండు సేవలూ భక్తులందరి చేత ప్రశంసలనందుకొనినాయనటం ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ఈ ట్రాలీలే గనుక లేకపోతే, భక్తులు ఎంత ఇబ్బంది పడేవారో!

అది చాలా కష్టమని భావిస్తుంటారు. కష్టముకాదు. దాని కంటె సులభమైనది మరొకటి లేదు. గుర్తించటంలో వున్నటు వంటిది దృష్టి యొక్క దోషమే కాని, సృష్టి దోషం కాదు, కాని, నీ దృష్టిదోషాలను సవరించుకోకుండా, సృష్టిదోషాలను నీవు వెదుకుతున్నావు కాని సృష్టిలో ఎట్టి తప్పు లేదు సర్వమూ ఏకత్వముగానే ఉంటున్నది నీ దృష్టిలోనే ఉంటున్నది భిన్నత్వం.

ఆత్మ విశ్వాసంతో ఏ పనిని చేబట్టినా విజయాన్ని సాధిస్తావు అమెరికాలో అతి బీద కుటుంబంలో పుట్టాడు లింకన్ తండ్రి వడ్రంగి పని చేస్తుండేవాడు. తల్లి పాత చీరెలను కుట్టి దాని మీద వచ్చే డబ్బుతో, కుమారుని పోషిస్తూ వచ్చేది ఈ పిల్లవాడు శ్రీమంతుల బిడ్డలతో కలిసి స్కూలుకు వెళ్ళుతుండేవాడు. వారు ఇతనిని హేళన చేస్తుండేవారు ఇతని డ్రస్సును చూచి చాలా గేలి చేస్తుండే వారు లింకన్ దీనిని భరించుకోలేక తల్లి దగ్గరకు వెళ్ళి ఏడ్చేవాడు 'అమ్మా! నా తోటి పిల్లలు అవమానం చేస్తున్నారు నాకు మంచి డ్రస్సు కుట్టించు!' అని అడిగేవాడు కాని తల్లి 'నాయనా! మన కుటుంబం యొక్క స్థితిని నీవు గుర్తించాలి. మనం చాలా బీదవారము. తినటానికే తిండిలేని మనం, ఏ విధంగా మంచి గుడ్డలు కుట్టించుకోగలం? కనుక మన స్థితికి తగిన గతిని నీవు అనుసరించు. నీవు ఏనాటికైనా అభివృద్ధిలోనికి వస్తావు ఆత్మవిశ్వాసంతో జీవించు ఇతరులు అవమానపరచినా వాటిని నీవు లెక్క చేయవద్దు మనకు అన్నింటికీ ఆత్మనే ఆధారము. ఈ ఆత్మవిశ్వాసంతో బ్రతకడానికి ప్రయత్నించు నాయనా!' అని ధైర్యం చెబుతూ ఉండేది. అప్పటి నుంచి లింకన్ ఆత్మ విశ్వాసంతో కష్టపడి చదివినాడు ఈ లోపల తల్లి మరణించింది తల్లి మరణించినప్పటికినీ తల్లి బోధలుమాత్రం విస్మరించలేదు స్థిరసంకల్పంతో ముందుకు నడిచాడు తండ్రి రెండవ పెండ్లి చేసుకున్నాడు ఆ సవతి తల్లికూడా ప్రేమతో చూచేది ఆ తల్లి కూడా అదే బోధలు చేస్తుండేది. తరువాత డిగ్రీ తీసుకున్నాడు. ఆ తరువాత కష్టములు ఎదురైనాయి. ఏదో ఒక ఉద్యోగం చేయాలనుకున్నాడు కాని ఆత్మవిశ్వాసంతో నడిచేవానికి ఉద్యోగం ఎందుకని భావించాడు తండ్రి వృత్తిలో జీవించడానికి వీలుకాలేదు తన స్వశక్తి పైననే ఆధారపడాలని భావించి, వ్యాపారంలో ప్రవేశించాడు. ఆ వ్యాపారం కూడా సత్యమైన మార్గంలో చేసాడు. సత్య

మార్గంలో నడవటంవలన, తోటి వారు అతనిని మోసం చేసారు. మంచిని చూచి ఎవరూ లోకంలో ఓర్వలేరు. అభివృద్ధిని చూచి సహించలేరు. ఇది అనాది కాలం నుంచి జరుగుతూ వస్తూనే ఉన్నది. కాని తన తల్లి మాటలను విశ్వసించి, ఎవరినీ లెక్క చేయకుండా ముందుకు సాగాడు. అయినప్పటికీ కట్టకడపటికి ఆ వ్యాపారంలో కూడా దెబ్బ తిన్నాడు. ఉన్న వస్తువులనన్నిటిని అమ్మివేసి ఋణాన్ని

"ధరణి ఋణము కంటెను దుఃఖమేది?
అన్నదానం కన్న అధిక దానంబేది ?
తల్లిదండ్రులకన్న దైవమేది ?
జపతపముల కన్న సత్యశీలంబేది ?
దయ కంటె ఎక్కువ ధర్మమేది?
శివుని సంగతి కన్నచూడ లాభంబేది?
ధరణి అపకీర్తి కంటె మరణమేది?
సర్వదా కీర్తి కంటెను సంపదేది?
ఋణము కంటెను రోగమేది?
స్మరణ కంటె మించిన ఆభరణమేది?"

ఆ విధమైన నమ్మకంతో ముందుకు నడుస్తున్నాడు. ఎవరి ఋణం వుంచుకోకూడదని భావించి, తన వద్దనున్న వస్తువులనన్నింటిని అమ్మివేసి, ఋణాన్ని తీర్చివేసాడు. ఈ సమయంలో అతని సచ్చరిత్రను గుర్తించిన కొందరు స్నేహితులు వచ్చి "ఇప్పుడు ఎన్నికలు రాబోతున్నాయి. నీవు నిలుచో! మేము సహాయం చేస్తాము" అన్నారు. వారి మీద నమ్మకంతో ఎన్నికలలో నుంచున్నాడు. విజయాన్ని పొందాడు. అన్ని పార్టీలవారు ఇతనిని చాలా పొగిడి, అతనిని అమెరికా అధ్యక్షునిగా చేసారు. అప్పుడు తన తల్లి చెప్పిన మాటలను స్మరించుకున్నాడు. ఆత్మవిశ్వాసం వున్నది కాబట్టే, తల్లి మాటల మీద విశ్వాసం వుంచాడు. తల్లి చెప్పినది కూడా సత్యమైన మాటలే. తాను చేసింది కూడా సత్యమైన పనే. ఆయన అమెరికా అధ్యక్షుడు అయిన సమయంలో, ఆ దేశంలో నల్లవారికి, తెల్లవారికి మధ్య కొంత మనస్పర్థలు వచ్చాయి. తెల్లవారు, నల్లవారిని చాలా హింసిస్తూ వచ్చారు. నీగ్రోలందరూ లింకన్ దగ్గరకు వచ్చి వారి బాధలు చెప్పుకొని, మమ్ములను సమానంగా చూడమని వేడుకున్నారు. లోకంలో ఉన్న వారందరూ భగవంతుని బిడ్డలేనని భావించాడు లింకన్. బేధములు ఉండకూడదని బోధించి, అందరి మధ్య సమన్వయాన్ని సాధించాడు. ఏకత్వాన్ని నిరూపించాడు. అందువలన నీగ్రోలందరూ అతనిని గౌరవిస్తూ వచ్చారు. లోకంలో మంచి చెడ్డలకు మధ్య సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఎప్పుడు? ఎవరి మధ్య జరుగుతుంది? మూర్ఖుల మధ్య జరుగుతుంటుంది. ఎవరైనా మంచి పేరు తెచ్చుకుంటుంటే, అభివృద్ధిలోనికి వస్తుంటే, వారిపైన లేని పోని అపోహలు కలిపిస్తుంటారు కొందరు స్వార్థపరులు. వాటిని మనం ఏ మాత్రం లెక్కచేయ కూడదు. నిందలు, స్తుతులు ఇవన్నీ మానవత్వంలో వచ్చే సహజములే. కీర్తికి, అపకీర్తికి మధ్య ఇలాంటివన్నీ జరుగుతూ ఉంటాయి. మన భారతదేశంలో కూడా గొప్ప పేరు పొందిన మహనీయులు కూడా వీటన్నింటినీ ఎదుర్కొనిన వారే. కాని, వారు ఆత్మ విశ్వాసంతో విజయాన్ని సాధిస్తూ వచ్చారు. సత్యంతో జీవించే వారికి, ప్రేమతో బ్రతికే వారికి, ఏనాటికి ముప్పురాదు.

దేహం ఏనాటికైనా పోయేదే. దీనిని రక్షించుకొనే నిమిత్తం మనం ఏనాటికీ పెడమార్గమున పోగూడదు. దేహం ఏదో ఒక రోజున పోతుంది. కాని సత్యం శాశ్వతంగా నిలుస్తుంది. కనుక మనం సత్యం కోసం పాటుపడాలి. సత్యము కంటే మించినది మరొకటి లేదు.

## వసుంధర రాజ్ సింధియా

సమాజంలో వచ్చిన మార్పుల వలన మహిళలు కూడా ముందడుగు వేస్తున్నారు. రాజస్థాన్ నుంచి తాను ఎన్నికైనప్పుడు సభలకు పురుషులు మాత్రమే అధిక సంఖ్యలో వచ్చేవారు. ప్రస్తుతం ఎక్కడ సభ నిర్వహించినా అధిక సంఖ్యలో మహిళలు వస్తున్నారు. ఈనాటి ఈ మహిళా సదస్సుకు ఇన్నివేలమంది, ప్రపంచం నలుమూలల నుండి రావటం విశేషం. ఈ ఉత్సవాలలో పాల్గొనే అవకాశం నాకు కల్పించినందులకు భగవాన్ బాబా వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. గతంలో ఇందిరా గాంధి, థాచర్‌లాంటి మహిళా నాయకులే మనకు కనిపించేవారు. ఈ శతాబ్దంలో ఇలాంటి వారు మరింత ఎక్కువయ్యే అవకాశం ఉన్నది. మహిళలు ఇంకా వెలుగు లోనికి వస్తారు. ఈ సదస్సుకు మహిళలు ఎక్కువ సంఖ్యలో రావడం వారిలో వచ్చిన చైతన్యానికి ఇది నిదర్శనం. బాబా వారి ఆశీస్సులు, ప్రేమాభిమానములతో, పేద ప్రజలకు మరింత సేవ చేయడానికి, కృషి చేస్తానని వాగ్దానం చేస్తున్నానని 19వ తేదీన పుట్టపర్తిలో జరిగిన మహిళా సదస్సులో కేంద్ర చిన్న తరహా పరిశ్రమ శాఖామంత్రిణి వసుంధరా రాజ్ సింధియా పేర్కొనినారు.

వారివారి మనోభీష్టాలు నెరవేరనప్పుడు, వారు విరుద్ధమైన మార్గాలలో ప్రవేశిస్తారు. ఇది వారి దోషమే కాని, నా దోషము కాదు. లోకములో భగవంతుని దూషించే టటువంటివారు నాలుగు రకములు. 1. దేవుడంటే నమ్మకం లేనివారు. 2. ఎదుటివారు అభివృద్ధి లోనికి వస్తుంటే చూడలేక, ఓర్చుకోలేనివారు. 3. వారు ఆశించిన కోరికలు నెరవేరకపోయేవారు. 4. ఎదుటి వారికి వచ్చిన పేరు ప్రతిష్ఠలు నాకు రాలేదేనని ఏడ్చేవారు. ఈ కారణాలతోనే దైవాన్ని దూషిస్తుంటారు. వారి వారి కోరికలు తీరనప్పుడు, అభీష్టాలు నెరవేరనప్పుడు దైవాన్ని దూషిస్తు ఉంటారు, తిరస్కారాలు చేస్తుంటారు. ఎవరు ఏమి చేసినా, నా సత్యంనాదే. కనుక ఎవరు దూషించినా, ఎవరు భూషించినా మీరు ఎవ్వరూ లెక్క చేయకూడదు. ఎందుకంటే మీ నమ్మకం మీది. దైవత్వం అనేది నమ్మకం మీద ఆధారపడి నటువంటిది. నమ్మకాన్ని ఎవరూ కలిపించేటటువంటిది కాదు. ఎవరి నమ్మకం వారిది. కొందరు దైవం ఉన్నాడు అంటారు, కొందరు లేడూ అంటారు.

"Yes అనువానికి Yes అనురా
No అనువానికి No అనురా
No Yes లు మన నోటికి కాని
సాయికి సర్వం YesYesYes"

ఎవరి మనసు వారికే సాక్షి. కనుక మనం ఎవరినీ లెక్క చేయకూడదు. మన విశ్వాసాన్ని, మన నమ్మకాన్ని, మన ఆత్మతత్త్వాన్ని మనం వదలకూడదు. ఇది దినదినాభివృద్ధి చెందుతుంటే, కొందరు "అసూయ" పడుతుంటారు. అసూయ అనేది గొప్ప రాక్షసి వంటిది. నవనవలాడుతుండే ఫలవృక్షంలో ఒక వేరు పురుగు చేరుతుంది. అది ఎవ్వరికి కనిపించదు. కాని, తల్లి వేరును కొట్టేసేటప్పటికి, రెండవ దినమే ఆ చెట్టు ఎండిపోతుంది, కూలిపోతుంది. అది చెట్టులోపమా? కాదు....కాదు... అదే విధంగా, అసూయ అనే దానిని గోప్యంగా ఉంచుకొని, లోపల లోపల ప్రచారం చేస్తుంటారు. అది దుర్మార్గుల తత్త్వము. కాని నా దృష్టిలో దుర్మార్గము లేనేలేదు. వారి చేష్టలు ఈనాడో, రేపో మారుతాయి. నా తత్త్వం మాత్రం ఒక్కటే. అందరూ నా వారే. నేను అందరి వాడినే. నా యొక్క ఆస్తి అంతా ప్రేమఒక్కటే. ఆ ప్రేమచేతనే, నేను అందరినీ ఆదరిస్తుంటాను. ద్వేషించిన వారిని కూడా నేను ప్రేమిస్తాను. నేను తప్పొప్పులను వెదకను. వారి దోషములను అంతకంటే వెదకను. నా ప్రేమను మాత్రమే నేను చూచు కుంటాను. ఇట్టి ఏకత్వాన్ని అందరూ గుర్తించాలి. ఈ Unity ఉన్నప్పుడే Purity మనలో వస్తుంది. ఈ Purity వచ్చినప్పుడే మనలో Divinity బయలుదేరుతుంది. కనుక మనం Divinity ని అభివృద్ధి పరచుకోవాలంటే మనలో Purity కావాలి. ఈ Purity కావాలంటే అందరూ కలిసిమెలిసి ఉండాలి. అప్పుడే తగినటువంటి ఫలితం మనకు లభిస్తుంది.

## ప్రతిజ్ఞ

భగవాన్ సాయి 75వ జన్మదినోత్సవాల సందర్భమున పుట్టపర్తిలో శ్రీవాణి ప్రత్యేకసంచికలు 75 కాపీలు భక్తులకు అమ్మాలని ప్రతిజ్ఞ పూనాడు తూర్పుగోదావరి జిల్లా రంగం పేటకు చెందిన శ్రీ లోలభట్టు శ్రీనివాసరాజు. తన సంకల్ప బలంతో, భగవాన్ సాయి దివ్యాశీస్సులతో 90 కాపీలు అమ్మాడు. పది క్రొత్త చందాలు కూడా చేర్పించి ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాడు.

శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్, పుట్టపర్తి అధినేత శ్రీ పి. సిద్దయ్యశెట్టి గారు శ్రీవాణి ప్రత్యేక సంచికలు 300 కాపీలు తీసుకొని, భక్తులకు అందించి రికార్డును సృష్టించారు. మరికొన్ని క్రొత్త చందాలను కూడా చేర్పించి అందించారు.

శ్రీ సాయి ప్రశాంతి ఎంటర్‌ప్రైజెస్, పుట్టపర్తి వారు శ్రీవాణి ప్రత్యేక సంచికలు 200 కాపీలు భక్తులకందించి ద్వితీయ స్థానంలో నిలిచారు.

సిద్దిపేటకు చెందిన న్యాయవాది శ్రీ ఎస్. వెంకట్రావు గారు 100 కాపీలు, మంచిర్యాలకు చెందిన శ్రీ యడ్ల లింగమూర్తిగారు 75 కాపీలకు డబ్బు పంపి శ్రీవాణి ప్రత్యేక సంచికలు తెప్పించుకున్నారు. కదిరికి చెందిన శ్రీ సత్యసాయి ఉచిత హోమియో వైద్యశాల కమిటీ కార్యదర్శి శ్రీ పి. జనార్దన్‌గారు వంద ప్రత్యేక సంచికలు తీసుకొని వెళ్ళి అక్కడి భక్తులకు అందించారు. ఇంకా.... ఇంకా.. ఎందరో మహానుభావులు శ్రీవాణి ప్రత్యేక సంచికను భక్తుల కందించడంలో కృషిచేశారు. తద్వారా సాయి సందేశవ్యాప్తికి దోహదపడ్డారు. వారందరికీ నా కృతజ్ఞతాభివందనలు. - సం

ప్రేమస్వరూపులారా!

ఈనాడు ఈ దేహమునకు 75 సంవత్సరాలు నిండినా యంటున్నారు. నాకు వయస్సుతో పనిలేదు. జగత్తు యొక్క క్షేమమే నాకు ప్రధానమైనటు వంటిది. కష్టజీవులను ఆదరించటమే నా ప్రధానమైన లక్ష్యము. ఎవరు ఏరీతిగా చాటినప్పటికినీ నా దీక్ష ఒక్కటే. కనుక...

"పట్టినపట్టేదో పట్టనే పట్టితివి
పట్టు నెగ్గెడు దాక అట్టెయుండు
అడిగినదేదియో అడుగనే అడిగితివి
అడిగినదిడుదాక విడువకుండు
కోరినదేదియో కోరనే కోరితివి
కోర్కె చెల్లెడుదాక పోవకుండు
పోరుపడలేక నేనైన బ్రోవవలయు
ఒడలు తెలియక మీరైన అడుగవలయు
అంతియె కాని ఇక మీయంత మీరు
తిరిగి పోవుట భక్తుని దీక్షకాదు."

నీవు కోరినటువంటిది చెల్లేంత వరకు గట్టి పట్టులో ఉంటుండు. ఇదియే మనకు దీక్ష. ఇదియే మనకు తపస్సు. తపస్సు అనగా అడవులకు వెళ్ళి తలక్రింద పెట్టి, కాళ్ళు పైకి పెట్టి చేయటం కాదు. మాటను దక్కించుకోవాలి. సత్యాన్ని కాపాడుకోవాలి. కృతజ్ఞతను పెట్టుకోవాలి. ఆత్మ విశ్వాసాన్ని నిలుపుకోవాలి. ఇదే భక్తుని లక్షణం. ఎలాంటి కష్టములు వచ్చినప్పటికీ లెక్కచేయక మన జీవితమునే మనం ఆధారం చేసుకోవాలి. ఆత్మ విశ్వాసాన్ని పెంచుకోవాలి. ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. ఆత్మ త్యాగం చేయాలి. ఆత్మవిశ్వాసం అనేది వయస్సును బట్టి మారదు. అందరియందున్నది Quality ఒక్కటే. Quantity వేరువేరుగా ఉండవచ్చును.

ప్రేమస్వరూపులారా!

ఈనాడు మన భారతదేశము సరియైన స్థితిలో తీర్చి దిద్దుకోవాలంటే, ఐకమత్యం అత్యవసరం. మన పూర్వ నాయకులు పట్టుదలతో స్వాతంత్ర్యమును సాధించారు. స్వాతంత్ర్యాన్ని సాధించారే గాని, దురదృష్టం వలన ఐకమత్యమును సాధించలేక పోయారు. ఐకమత్యం లేనప్పుడు కేవలం స్వాతంత్ర్యం వచ్చి ప్రయోజనం ఏమిటి? ఐకమత్యం లేకపోవటం వలననే, ఇలాంటి అవస్థలు వస్తున్నాయి. ఎక్కడ చూచినా ద్వేషములే. ఒక్క పార్టీ లోపలనే పది పార్టీలు. ఒక కుటుంబంలోనే నాలుగు దోవలు. ఈ విధంగా ఉంటుంటే, మనం ఏవిధంగా సుఖాన్ని పొంద గలం? ఇది కాదు. అందరి యందున్న ఏకత్వాన్ని మనం గుర్తించాలి. విశ్వసించాలి. దేశమును కాపాడుకొనే నిమిత్తమై, ఐకమత్యము చేత, అందరూ ఒకటైపోతే, ఎలాంటి దివ్యశక్తినైనా సాధించవచ్చును. ఏమార్గములోనైనా విజయాన్ని పొందవచ్చును.

ప్రేమస్వరూపులారా!

భారతదేశములో ఉండినటు వంటి పవిత్రత మరొక దేశంలో లేదు. అందువలననే యిక్కడ అనేక అవతారములు ఉద్భవిస్తూ వచ్చాయి. కనుకనే భారతదేశము అన్ని దేశము లకు తల్లి వంటిది. అట్టి పవిత్రమైన తల్లిని మనం ఏవిధంగా చూస్తున్నాం? తల్లిని గౌరవించాలి. మాతృదేశమును ప్రేమించాలి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

## ఉమాభారతి

"21వ శతాబ్దంలో మహిళలకు రాజ్యాధికారం రావటం ఖాయం. మహిళలు అన్ని రంగాలలో ముందంజలో ఉండేందుకు ఇప్పటికే భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు ఎంతో కృషి చేస్తున్నందులకు వారిని ప్రశంసిస్తున్నాను. 21వ శతాబ్దంలో శాస్త్ర సాంకేతిక, సమాచార రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. ఈ రంగాలలో శారీరక శ్రమకు పనిలేదు. కేవలం తెలివితేటలు, విజ్ఞత ఉంటేచాలు. శారీరక శ్రమతో పనిలేని ఈ రంగాలలో మహిళలు బాగా రాణిస్తారు. కులం, మతం, భాషా అంటూ ఇప్పటికే సమాజం ముక్క చెక్కలవుతున్నది. ఈ పరిస్థితులలో మహిళలు, పురుషులు అంటూ లైంగిక పరంగా విభజన సరికాదు. పురుషులతోపాటు మహిళలకు సమానత్వం తీసుకొనిరావలసిన అవసరం ఎంతైనా ఉన్నది. నేను కష్ట సమయాలలో ఉన్నప్పుడు ముఖ్యంగా మంత్రి పదవికి రాజీనామా ఇచ్చిన సందర్భంలో, భగవాన్ బాబావారు నాకు ఎంతో మనోధైర్యాన్ని ప్రసాదించి ప్రోత్సహించారు. బాబా ఆశీర్వాదంతో నేను తిరిగి బలం పుంజుకోగలిగాను" అని కేంద్ర యువజన క్రీడల శాఖా మంత్రిణి ఉమాభారతి నవంబర్ 19వ తేదీన ప్రశాంతి నిలయంలో జరిగిన "మహిళా సదస్సు"లో బాబావారి సమక్షంలో ప్రసంగించారు.

అన్నాడు శ్రీరాముడు. మాతృదేశము, స్వర్గానికన్నా మిన్న. కనుక నా మాతృదేశము నా తల్లితో సమానమన్నాడు. ఆ సత్యాన్ని గుర్తించి వర్తించాలి. కేవలం రామ.. రామ.. అంటే చాలదు. రాములవారి లక్ష్యమును ఆచరించాలి. రామ నామం స్మరించటంలో హీరోలైపోతున్నారు. ఆచరణలో 'జీరో'లై పోతున్నారు. కనుక శ్రీరాముని బోధలు ఆచరణలో పెట్టాలి.

"ఏక్ ప్రభుకా అనేక నామ్". ఏ దేవుడైనా, ఏ నామమైనా అన్నీ ఒక్కటే. అనేక పేర్లు ఉండినప్పటికినీ దేవుడు ఒక్కడే. సహస్రనామార్చన చేస్తున్నాం. వెయ్యి పూలు తెచ్చి పెట్టుకున్నాం. కేశవాయనమః, నారాయణాయ నమః, మాధవాయ నమః.. ఈ విధంగా ఒక్కొక్క పేరుచెప్పి ఒక్కొక్క పుష్పం వేస్తున్నాము. కాని ఒక్కొక్క పేరుకు అక్కడ ఒక్కొక్క రూపం ఉన్నదా? ఒక్క రూపమునే ఇన్ని పేర్లతో పూజిస్తున్నాము. కనుక భగవంతుడు ఎక్కడ ఉన్నాడు? సర్వ రూపములలో నీయందే ఉంటున్నాడు. దీనిని అంగపూజ అని కూడా అంటారు. "నేత్రం సమర్పయామి' అంటే నీవు నేత్రమును సమర్పిస్తున్నావా? ఇలాంటి పూజలు చేయటం ఎంత దోషము. ఇలాంటి పూజల వలన మనకు ఏమి తృప్తి? తృప్తే లేదు. భగవంతుడు కూడా దీనిని అంగీకరించడు. చెప్పేది నేత్రం, ఇచ్చేది పుష్పము. దైవం ప్రసాదించిన ఈ అంగములను మరల ఎందుకు దైవానికి యివ్వాలి? అంతా నీవే. ఈ దేహమే నీది. ఈ అంగములే నీవి. నేనే నీవాడను. నువ్వే నా వాడవు. ఈ రెండింటి యొక్క సంబంధాన్ని పెట్టుకున్నప్పుడు ఏ యొక్క పూజలు మనకు అవసరం లేదు. అయితే అంతటి ఉన్నత స్థాయికి రాలేనటువంటివారు చిన్న చిన్న పూజలు చేసుకోవచ్చును. తప్పు లేదు. ధ్యానం చేసుకోవచ్చును. తప్పులేదు. జపం చేసుకోవచ్చును. తప్పు లేదు. కాని ఇవన్నీ కొన్ని అభ్యాసములతో ఏర్పడినటువంటివే. క్రమక్రమేణా వీటన్నింటినీ తగ్గించుకుంటూ రావాలి.

ఈ కలియుగంలోపల చాలామంది, తమ మనోభీష్టములు విఫలమైనప్పుడే, భగవంతుని దూషించడం అభివృద్ధి అవుతున్నది. ఇది అన్ని దేశములయందూ ఉంటున్నది. ఇలాంటి అపవిత్రమైన భావాలను మనం ఏ మాత్రం తీసుకోకూడదు. ఎవరు ఏ భావంతో తలిస్తే వారికి ఆ విధంగా రూపొందుతుంది. మంచి భావంతో తలిస్తే, ఆ మంచే నీకు ప్రాప్తిస్తుంది.

ఎవరినీ ద్వేషించకండి, నిందించకండి. సాధ్యమైనంత వరకూ అందరినీ ప్రేమిస్తూరాండి. ఒకవేళ అవకాశం లేకపోతే ప్రేమించటం మానుకోండి. కాని దూషించకండి. ఆ విధమైనటువంటి ఏకత్వాన్ని అభివృద్ధి పరచుకోవాలని నేను ఆశిస్తున్నాను. నాకెప్పుడు ఈ జన్మదినోత్సవాల మీద కోరిక లేదు. కాని భక్తులందరూ చేరటం వలన వారి కోసం ఈ పండుగను చేసుకుంటున్నాను. నాకేమి ఇష్టం లేదు. ఆ భక్తులు నేను. ఈ రెండింటి సంబంధమే నా సంబంధం, కనుక ప్రేమతత్వాన్ని అభివృద్ధి పరచుకోండి. దేశ క్షేమాన్ని మాత్రం లక్ష్యమునందుంచుకోండి.

ఈనాడు లోకములో అసూయాద్వేషములు అభివృద్ధి అవుతున్నాయి. వాటిని అణగద్రొక్కాలంటే ప్రేమతత్వం ఒక్కటే చాలు. ప్రేమతత్త్వాన్ని పెంచుకోండి. ప్రేమ ఒక్కటే చాలు. ప్రేమ చేతనే మనం జీవించాలి. ప్రేమతోనే మనం బ్రతకాలి. ప్రేమనే మనం ఆరగించాలి. మన అభీష్టములు నెరవేరినా, నెరవేరకపోయినా ఇది కూడా మన మంచి కోసం వచ్చిందనే సత్యాన్ని గుర్తించి వర్తించాలి. కష్టములు, నష్టములు నా మంచి కోసమే వచ్చినవని భావించండి. దీనిలో కూడా ఒక మంచి ఉన్నదని తలంచండి. ఏమి చేసినా దానిలో ఒక మంచి ఉంటూనే ఉంటుంది. "మంచి

## క్లోజ్‌డ్ సర్క్యూట్ టి.వి.లు

భగవాన్ సాయి జన్మదినోత్సవ వేడుకలు భక్తులు తిలకించడానికి ప్రశాంతి నిలయంలో అడుగడుగునా "క్లోజ్‌డ్ సర్క్యూట్ టి.వి.లు" అమర్చటం ఈ సంవత్సరం విశేషం. సర్వధర్మ స్థూపం దగ్గర 35 ఎమ్.ఎమ్. వీడియో స్క్రీన్లు కూడా రెండు అమర్చారు. నవంబర్ 23వ తేదీన తప్ప మిగతా అన్ని రోజులలో కార్యక్రమాలు ప్రశాంతి నిలయంలోనే జరిగాయి. ప్రసంగాలు సాయి కుల్వంత్ హాల్‌లో, సాంస్కృతిక కార్యక్రమాలు పూర్ణచంద్ర ఆడిటోరియంలో జరిగాయి. ప్రశాంతి నిలయంలో మారు మూలన కూడా టి.వి.లు ఏర్పాటు చేయటం వలన భక్తుల రద్దీ ఎక్కువగా ఉన్నప్పటికీ ప్రశాంతంగా ఎక్కడి వారక్కడే కూర్చొని తిలకించి ఆనందించారు. 23వ తేదీన హిల్‌వ్యూ స్టేడియంలో జరిగిన స్వామి జన్మదినోత్సవ వేడుకలకు వచ్చిన భక్తులతో ఉదయం గం॥ 6-00 లకే స్టేడియం నిండిపోయింది. మిగతా లక్షలాది భక్తులు స్టేడియం బయటే ఉండిపోవలసివచ్చింది.

చెడ్డలు రెండుగా పోల్చి ఉండు". ఈ రెండూ లేకుండా ఏదీ కాదు. చెడ్డ లేకుండా మంచి రాదు. మంచి లేకుండా చెడ్డ జరుగదు. కనుక చెడ్డలోనే మంచి ఉన్నది. మంచి లోనే చెడ్డ ఉన్నది. కనుక రెండింటినీ ఏకత్వంగా తీసుకోండి.

ఆశలు పెంచుకోకండి. Desires ను తగ్గించుకో. Divine Desires ను పెంచుకుంటే ఎంతయో హాయి మనకు చిక్కుతుంది. కోరికలు పెరిగిన కొద్దీ, ఆనందం అంత తగ్గుతుంది. కోరికలు తగ్గిన కొద్దీ ఆనందం అంత పెరుగుతుంది. ఆనందం లేకపోవటానికి కారణం కోరికలే. కనుక కోరికలు తగ్గించుకోండి.

సత్యభామ కృష్ణుని బంగారంతో తూచడానికి ప్రయత్నించి విఫలమైంది. కాని రుక్మిణి కేవలం తులసి దళంతో కృష్ణుని తూచగలిగింది. భగవంతుడు బంగారమునకు చిక్కడు. ధనమునకు దొరకడు. గుణమునకు మాత్రమే చిక్కుతాడు. ప్రేమకు లొంగుతాడు. కనుక ప్రేమను పెంచు కోండి. మీ అభీష్టములన్నీ నెరవేరుతాయి. ద్వేషించకండి. ఇదియే మీకు సరియైన ఆదర్శము. ఇది ముఖ్యమైనటు వంటి సందేశము. ప్రేమ స్వరూపులు మీరు కావాలి. ప్రేమ హృదయులు కావాలి. ప్రేమమయులు కావాలి. ప్రేమా నందమును మీరు అనుభవించాలి. ఇదియే ఈనాడు నేను మీకు యిచ్చేటటువంటి గొప్ప Gift. నా దగ్గర ఉన్నటువంటి స్వంత ఆస్తి అది ఒక్కటే. ప్రేమనే... ప్రేమనే... కనుక ఆ ప్రేమను మీకు ఎంతైనా యిస్తాను. కడపటికి దేహమునైనా మీకు యిస్తాను. మీరు ఆనందంగా జీవించండి! ఆదర్శ వంతులుగా బ్రతకండి! అప్పుడే నాకు నిజమైన ఆనందం కలుగుతుంది. ఏదిచ్చినా నాకు ఆనందం కాదు. మీ ప్రేమనే నాకు ఆనందం. నా ప్రేమనే మీకు సౌభాగ్యం. కనుక మీరు దానిని కాపాడుకోవాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

అందరూ ఈనాడు శాశ్వతమైనటువంటి భక్తిని, పవిత్రమైన, దీర్ఘమైన, సుఖమైన జీవితాన్ని పొందుదురు గాక! పొందుదురు గాక! మీ కష్టములన్నీ పరిహారము అవుగాక! కనుక కష్టములను గురించి యోచించక, లభించిన సుఖాన్ని అనుభవిస్తూపోండి!

(ది. 23-11-2000న పుట్టపర్తిలోని హిల్‌వ్యూ స్టేడియంలో తన జన్మదినోత్సవ సందర్భమున జరిగిన బ్రహ్మాండమైన మహాసభలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి)

# సంగీత కళాశాల

"దేశంలో పాశ్చాత్య సంగీతం వెర్రితలలు వేస్తున్నది. శాస్త్రీయ సంగీతానికి ముప్పు వాటిల్లింది. శాస్త్రీయ సంగీతాన్ని దూరదర్శన్ కూడా ప్రోత్సహించటం లేదు. అర్ధరాత్రి తరువాత శాస్త్రీయ సంగీతాన్ని ప్రసారం చేస్తున్నారు. నిద్ర సమయం గదా! ఎవరు వింటారు? శాస్త్రీయ సంగీతం విస్తరించడానికి ప్రచారం, ప్రోత్సాహం అవసరం. పాశ్చాత్య సంగీతాన్ని ప్రోత్సహించేందుకు ఎన్నో టి.వి. ఛానల్స్ ఉన్నాయి. కాని, శాస్త్రీయ సంగీతానికి ఒక ప్రత్యేక ఛానల్ కూడా లేదు. ఇటువంటి పరిస్థితులలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు శాస్త్రీయ సంగీతా భివృద్ధికి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని ఒక సంగీత కళాశాలను ఏర్పాటు చేయటం హర్షణీయము" అని అన్నారు. బాబా జన్మదినోత్సవ కార్యక్రమాలలో పాల్గొనడానికి వచ్చిన ప్రముఖ సంగీత విద్వాంసులు ఉస్తాద్ దిల్‌షాద్ ఖాన్. వీరు పాకిస్థాన్‌లోని ప్రఖ్యాత సంగీత విద్వాంసులు. బడే గులాం అలీఖాన్ గారి వద్ద శిష్యరికం చేశారు.

మరుగున పడిన భారతీయ సంస్కృతి కళలకు తిరిగి జీవం పోయాలనే సంకల్పంతో, అత్యంత ఆధునిక సాంకేతిక విజ్ఞానంతో నిర్మించబడిన, సంగీత కళాశాల భవనాన్ని నవంబర్ 20వ తేదీన బాబావారే స్వయంగా ప్రారంభోత్సవం చేశారు. ఈ భవనం మధ్యలో నిలుచుని సంగీతం ఆలపిస్తే 20 సార్లు తిరిగి వినిపించేలా ఈ భవనాన్ని నిర్మించారుట. వీధి నాటకాలు, హరికథలు, చెంచునాటికలు, తోలుబొమ్మలాటలు, బుర్రకథలు, పండరి భజనలు వంటి ప్రాచీన కళలకు తిరిగి జీవం పోయటమే స్వామి ఆశయం. నాలుగు నెలల క్రితమే పరిసర గ్రామాలలో, ఇలాంటి కళలలో నిష్ణాతులైనవారి ప్రదర్శనలను ఏర్పాటు చేసుకొని బాబా తిలకించారుట. అట్టి కళలను పునరుద్ధరించడం, శాస్త్రీయ సంగీతాన్ని ప్రోత్సహించడమే భగవాన్ సాయి లక్ష్యము. ఈ సంగీత కళాశాల నిర్మాణానికి ఇండోనేషియాకు చెందిన శ్రీ పూరీ ఒక్కరే 10 కోట్ల రూపాయల విరాళము స్వామికి గురుపూర్ణిమ (29-7-1999) రోజున సమర్పించుకోవడం విశేషం. ☆





# ఆదికవి 'నన్నయ'





సంస్కృతంలో రసప్రధానమైన ప్రథమ మహాకావ్యం రామాయణమయితే తెలుగులో ఆంధ్రమహాభారతం తొలికావ్యం. నన్నయభట్టు ప్రథమాంధ్రకవి. "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడు దెనుగున రచియింపుమని"రాజరాజనరేంద్రుడు కోరగా, నన్నయ మహాభారతాన్ని ఆంధ్రీకరించాడు.

నన్నయ రాజరాజనరేంద్రుని కుల బ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడు. ముద్గలగోత్రుడు. విపుల శబ్ద శాసనుడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు. లోకజ్ఞుడు. రాజరాజుపట్ల అనురక్తుడు. అయితే రాజరాజు కోర్కెను పరిపూర్ణంగా నెరవేర్చేందుకు నన్నయ 'కృత్యా ద్యవస్థ'నంద వలసివచ్చింది. ఆనాటికి తెలుగు భాషలో చెప్పదగ్గ కావ్యాలు లేవు. భాష కూడా అస్తవ్యస్తంగా ఉంది. ఛందోనియమాలు, వ్యాకరణ మర్యాదలు తగినట్లు లేవు. పైగా సంస్కృతానికే రాజస్థానాల్లో పెద్దపీట. దేశ భాషలంటే చిన్నచూపు. పంచమవేదంగా గౌరవింపబడుతున్న మహాభారత కావ్యాన్ని తెలుగు భాషలోకి అనువదించటం ఆనాటి పండితులకు ఆమోద యోగ్యంకాదు. అటువంటి క్లిష్టసమయంలో **"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబు నందు నారాయణునట్లు"** నన్నయ సహాధ్యాయుడు నారాయణభట్టు తాను గంటం పట్టకుండా నన్నయకు భారత రచనలో సహాయం చేశాడు. నారాయణభట్టు కన్నడ భాషలో కూడా పండితుడు. కన్నడభాషలో అప్పటికే భారతం రచింపబడింది. అందులోని గుణదోషాలనూ, చేయవలసిన మార్పు గురించీ ఇద్దరూ చర్చించుకున్నారు. సంస్కృత భారతాన్ని తెలుగులో మక్కికి మక్కీగా వారు అనువదించదల్చుకోలేదు. స్వతంత్ర కావ్యంగా దాన్ని సంతరించాలని నిశ్చయించుకున్నారు. అయితే ఆనాడు ఉత్తర మధ్యదక్షిణ దేశ ప్రతులలో పాఠభేదములెక్కువగా ఉన్నాయి. కథాక్రమంలో గూడా తేడా ఉన్నది. పునరుక్తులు, అనౌచిత్యఘట్టాలు, విసుగుకల్గించే వర్ణనలు ఉన్నాయి. నన్నయ వాటినన్నిటినీ పరిహరించాడు. భారతాన్ని రచించకముందు నన్నయ ఆంధ్రశబ్ద చింతామణిని రచించాడని ఒక బలమైనవాదం ఉన్నది. కాదన్న వారూ ఉన్నారు. సంస్కృత మహాభారతము ఆమూలాగ్రము శ్లోకమయము. ఆంధ్రీకరించునప్పుడు పద్యగద్యచంపూ కావ్యాలలో దేనిలో రచించాలో నన్నయకు మొదట నిశ్చయం కాలేదు. అలాగే దేశిమార్గకవితారీతులలో దేనిలో వ్రాయాలో అన్న సందేహం కూడా కలిగింది. చివరకు దేశిమార్గ కవితారీతుల రెండింటిలోనూ చంపూ కావ్యంగా రచించటానికి నన్నయ నిశ్చయించుకున్నాడు.

**డా॥ మాదిరాజ రామలింగేశ్వరరావు**

నన్నయ తెలుగులో పద్యవిద్యకు ఆద్యుడు. గద్యానికి కూడా ఆయన చక్కని దారి చూపించాడు. కావ్యారంభంలో దేవతా ప్రార్థన చేయడం శుభప్రదం. అందువల్ల నన్నయ 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ...' అనే శ్లోకంతో తన తెనుగు భారతాన్ని ఆరంభించాడు. ఇది త్రిమూర్తి స్తవం. తరువాత **'అని సకల భువనరక్షణ ప్రభువులై'** అన్నవచనం ఉంటుంది. భారతకథ వేదవ్యాసులవారి పుట్టుకతో ఆరంభమవుతుంది. తర్వాత శంతనుకథ, భీష్మజననం, వ్యాసుని అనుగ్రహంవల్ల ధృతరాష్ట్ర పాండురాజుల పుట్టుక, కర్ణజననం వేటలో పాండురాజుకి శాపం తగలడం, కుంతికి దేవతలిచ్చిన వరాలవల్ల పంచపాండవులు జన్మించడం, పాండురాజు మరణం, కుంతి కొడుకులతో కలసి హస్తినాపురానికి రావడం, కౌరవ పాండవుల కలహం ఆరంభమవటం, లక్క ఇల్లు దగ్ధం కావటం, పాండవులు బయటపడటం, ద్రౌపది స్వయంవరం, సుభద్ర వివాహం, పాండవులు ఇంద్రప్రస్థంలో నివసించడం, ధర్మరాజు రాజసూయయాగం, శిశుపాలవధ దుర్యోధనుని దురాలోచన, జూదంలో పాండవుల ఓటమి, ద్రౌపదివస్త్రాపహరణం, పాండవుల అరణ్యావాసం, నహుషుని వృత్తాంతం ఇదే ప్రధానంగా నన్నయ భారత భాగంలో ఉన్న భారతకథ. ఆ గాథకు అనుబంధంగా యయాతి చరిత్ర, దుష్యంతోపాఖ్యానం, నవోపాఖ్యానం, తపతీసంవరణం

వంటివి మధ్యమధ్య ఎన్నో వస్తాయి. అరణ్యపర్వందాకా వచ్చాక ఆయన గంటం ఆగిపోయింది.

నన్నయ రచనలో ముఖ్యగుణాలు - ప్రసన్న కథా కవితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తినిధిత్వము ప్రధాన కథతో ఉపకథకు ఉన్న సంబంధాన్ని తెలిపి, దానిని వినగానే పాఠకుని మనోవీధిలో హత్తుకునేలా, ప్రత్యక్షమయ్యేలా చేయటం ప్రసన్నకథ లక్షణం. రచనలో కథతోపాటు ఒక మహార్థాన్ని ప్రవేశింపచేయటం కవితార్థ యుక్తి మనోహరములు శ్రుతిపేయములూనైన శబ్దముల కూర్పును నేర్పుగా చేయుటయే అక్షరరమ్యత. '**కమ్మని లతాంతమ్ములకు మ్మొనసివచ్చు మధుపమ్ముల**' అనే పద్యం అక్షరరమ్యతకు చక్కని ఉదహరణ. అలాగే '**దారుణ జానుదండమున దండ ధర ప్రతిముంటు భీకరారుడు..**' అనే పద్యం కూడా ఇందులో మరో చక్కని ఉదాహరణ. రుచిరార్థ సూక్తులంటే మనోహరములై గంభీరార్థములతో కూడిన సుభాషితాలని భావం. నానాఅనటంవల్ల యివి అనేక విధములని భావం. అంటే ఈ సూక్తుల్లో కొన్ని జ్ఞానప్రబోధాలు,

**"మతి దలపగ సంసారం బతిచంచలము"**

కొన్ని నీతిబోధకాలు :

**"ఆరంభరహితు బొందునెయారయసంపదలు"**

కొన్ని సామెతలు లోకోక్తులు - జాతీయములు నానుడులు

**"వంటయిలు కుందేలుసొచ్చె"**

**"వృద్ధుల బుద్ధులు సంచలింపవే"**

నన్నయ తన భారతాన్ని నానారసాశ్రయం కావించాడు. అందులో అంగిరసం శాంతమని కొందరు, వీరయని మరికొందరు అంటారు. అంగరసాలను సన్నివేశాల కను గుణంగా నన్నయ పోషించాడు. '**ప్రకటిత కోపవేగమున**' అన్న పద్యం '**ధారుణి రాజ్యసంపదమదంబున....**' అన్న పద్యం నన్నయ రసపోషణకు మచ్చుతునకలు.

పాత్రచిత్రణలో నన్నయ్య దిట్ట. ధృతరాష్ట్రుడు జూదమునకు తన సమ్మతిని ఇవ్వటం విషయంలో దుర్యోధనునితో ఇలా అంటాడు. '**ధీరమతి విదురుతోడ విచారింతము, వాడు నయవిశారదుడు, కళాపారగుడు, దీర్ఘదర్శి, యపార హితారంభుడు భయపక్షంబులకున్**' ఈ మాటలను బట్టి విదురుడెంతటి ధర్మనిర్ణయ పరాయణుండో మనకు అవగతమవుతుంది. ద్రౌపది ధర్మజ్ఞతకు నిదర్శనంగా ఈ పద్యం '**మున్ను దన్నోటువడి మతినన్ను నోటువడియెనో, నన్ను మున్నోటువడి, విభుండు గ్నదన్నోటు వడియెనోయన్న! నాకు నెఱుగజెప్పుము దీని నీవెఱుగుదేని!**'.

నన్నయ తన అవసరాలకి అనుగుణంగా సంస్కృత భారతంలో లేని ఎన్నో వర్ణనలను, మధుర భావాలను తన భారతంలో పొందుపరిచాడు, గంగానదిలో కర్ణునివిడిచి పెట్టిన సమయంలో కుంతి యొక్క దుఃఖాన్ని హృదయ-విదారకంగా వర్ణించి మాతృప్రేమను నన్నయ వెల్లడించాడు. ఇది సంస్కృత భారతంలో లేదు. అలాగే దమయంతి పరిచారికలు భీమరాజుదగ్గరకు వెళ్ళి ఆమె విరహ వేదనను వివరిస్తారు. ఇది సంస్కృత భారతంలో లేదు. అలాగే లక్షా గృహంలో పాండవులు మాతృసహితంగా మరణించారని ప్రజలు దుఃఖించిన సన్నివేశం కూడా సంస్కృత భారతంలో లేదు.

ఇలా నన్నయ తన భారతరచనలో అవసరమైన మార్పులు చేర్పులూ చేసి, ఉపమ, అర్థాంతరన్యాసము, స్వభావోక్తి వంటి అలంకారములను ప్రయోగించి, తరులోభ, మధ్యాక్కర, ఆటవెలది, తేటగీతి మొదలైన దేశికవితా సంప్రదాయ పద్యాలనూ రచించి, '**భారత భారతీ సముద్రము దతియింగ నీదుటకు**' ప్రయత్నం చేశాడు. అయితే అరణ్య పర్వంలోనే ఆయన గంటం ఆగిపోయింది. తిక్కన, ఎఱ్ఱా ప్రగడలు ఆ కొరతను పూర్తి చేశారు. '**ఆదికవి**'గా తెలుగు సాహిత్యంలో నన్నయ శాశ్వతకీర్తిని గడించుకున్నాడు. ○

"సద్వా సద్వా పరీవాదో బ్రాహ్మణస్య నశస్యతే
నరక ప్రతిష్ఠా స్తేష్వెస్యుర్య ఏవం కుర్వతే జనాః"

బ్రహ్మవేత్తయైనవాడు ఒకరియందున్న నిందను గురించి ప్రస్తావించటంగాని, ఒకరిపై నిందారోపణ చేయటంగాని చేయడు. ఈ విధంగా ఒకరిని నిందించే వారు నరకాన్ని పొందుతున్నారు.

**తెనుగుసేత - శాంతిశ్రీ**



# సమభావాన్ని పెంచుకోవాలి! సమిష్టిగా జీవించాలి!



"అస్థిరం జీవనంలోకే
అస్థిరం యౌవనం ధనం
అస్థిరం దారాపుత్రాది
ధర్మం ప్రేమద్వయం స్థిరం"

ప్రేమస్వరూపులారా!

ఈ ప్రపంచమునందు ఏదియూ శాశ్వతమైనది కాదు. అన్నియూ కదిలిపోయే మేఘములే. సంపదలుగాని, బంధు మిత్రాదులుగాని సర్వమూ కాలానుగుణ్యంగా కదిలిపోయే టటువంటివే. మానవ జీవితం చాలా విలువైనటువంటిది. ఇట్టి మానవజీవితం ఇంద్రియ సమేతంగా దేహమును ధరించి, పంచభూతములచేత మానవుడు ప్రయాణం సలుపుతున్నాడు. ఇది మనస్సునకు ప్రత్యేకించినటువంటిది కాదు. మనస్సునకు దేహం ఒక కవచం వంటిది. ప్రతి జీవి ఈ దేహమును ఒక కవచంగా ధరిస్తుంటుంది. ఈ విధంగా ధరించినటువంటి మానవత్వమును, సద్వినియోగ పరచి, సదాచారములయందు ప్రవేశపెట్టి తద్వారా మనస్సునకు శాంతిని చేకూర్చాలి. కాని మానవుడు దేహములో బంధించబడినది ఈమనస్సు అని చింతించటంచేత, తాను బందీ అయిపోతున్నాడు. ఈ మనసు దేహములో బంధింపబడినటువంటిదికాదు. ఇది బంధింపబడినదని తలచటమే పెద్ద అజ్ఞానము. 'మనోమూలం ఇదంజగత్' ఈ మనసు సర్వత్రావ్యాపించి వుంటూనే ఉన్నది. ఇది దేనికీ బందీకాదు. అది ఎప్పుడూ స్వేచ్ఛగానే ఉంటుంది. కాని దేహము ఒక పనిముట్టు వంటిది. అయితే ఈ పనిముట్టును సరియైన మార్గంలో, సక్రమమైనరీతిలో ఉపయోగపెట్టటానికి కృషి చేయాలి. పంచభూతములతో కూడినటువంటి ఈ శరీరము 'నేనే' అని భ్రమించి, తన తత్వాన్ని, జీవతత్వంగా మార్చుకొనలేక, దైవత్వంగా మార్చుకొనలేక, కేవలం పాంచభౌతికమైన దేహంగానే విశ్వసిస్తున్నాడు మానవుడు. ఈ విశాలప్రపంచమునందు ప్రతి మానవుడు కూడనూ ఈ శరీరమును 'నేను..నేను..' అనే పదముతో వినియోగించుకున్నాడు. కాని దేహం తాను కాదు. దేహము కేవలం కవచం వంటిదే. ఇది ధరించినటు వంటి ఒక పనిముట్టు. ఈ పనిముట్టునే 'దేహము' అని భావించుకోవటమే పెద్ద అజ్ఞానము.

'విలువలేని ఇనుపపెట్టెయందు విలువగలిగిన నగలు చేర్చినట్లు' ఈ విలువలేని దేహమునందు, విలువైనటువంటి సద్గుణములను మనం దాచిపెట్టుకున్నాం. ఈ దేహము పరిశుద్ధమైనటువంటిదికాదు.

## భగవాన్ సాయి హితబోధ

'మలినపుకొంప రోగముల మ్రగ్గెడు సేవకగంప జాతసం
చలనము పొందు దుంప భవసాగర మీదగలేనికంప అం
బులపాది లెమ్ము చూడు మనమెచ్చుదలంపగ దేహమింక ని
శ్చలమని నమ్మబోకుము మనసా హరిపాదము
లాశ్రయింపవే.'

ఇట్టి దేహమునే నీవు సత్యముగా భావించి, ఈ దేహ నిమిత్తమై అనేక పాట్లు పడుతున్నారు. దేహమే 'నేను' అని భావించటం చేతనే మానవుడు అనేక కష్టములకు గురి అవుతున్నాడు. దేహమును కాపాడుకొనే నిమిత్తము, దేహమును పోషించుకునే నిమిత్తము అన్ని రకముల బాధలను అనుభవిస్తున్నాడు. కాని ఇందులో చక్కగా సత్య సంకల్పాలను అర్థం చేసుకోవాలి. సత్యసంకల్పములే మానవునికి సరియైన ఆస్తి. కాని అట్టి పవిత్రమైన సత్య సంకల్పాలను విస్మరించి, కేవలం బాహ్యమైనటువంటి, అనిత్యమైనటువంటి, అశాశ్వతమైనటువంటి, ప్రాకృత మైనటువంటి సంస్కారములే సత్యములని భావిస్తున్నాడు. వీటి చేతనే కర్మలు ఆవిర్భవిస్తున్నాయి. కర్మల వలననే అభిమానం అభివృద్ధి అవుతున్నది. ఈ అభిమానం అభివృద్ధి కావటంచేతనే మానవుడు శీలమును కోల్పోతున్నాడు. ఈ శీలమును కోల్పోవటం చేతనే తన దివ్యత్వమును తాను మరచిపోతున్నాడు.

శీలము చాలా విలువైనటువంటిది. ఒకానొక సమయంలో ఇంద్రుడు తన రాజ్యమును కోల్పోయి, దేవతల గురువైన బృహస్పతి వద్దకు వచ్చి 'స్వామీ! నేను రాజ్యభ్రష్టుడనైనాను. తిరిగి రాజ్యమును పొందేఅవకాశం లభించునా? ఏవిధమైనమార్గం అనుసరిస్తే, తిరిగి ఇది నాకు ప్రాప్తిస్తుంది?' అని ప్రశ్నించాడు. అప్పుడు 'బృహస్పతి' నాయనా! ఇప్పుడు ప్రహ్లాదుడు 'విశ్వజిత్' అనే యజ్ఞము గావిస్తున్నాడు. ఈ సమయంలో అడిగిన వారందరికీ లేదనక దానములు యిస్తాడు. కనుక పేదబ్రాహ్మణవేషం ధరించి ఆ ప్రహ్లాదుని దగ్గరకు వెళ్ళి భిక్షం అడుగు ' అన్నాడు. అదేవిధంగా పేదబ్రాహ్మణవేషం ధరించి అసలుఇంద్రుడు ప్రహ్లాదుని దగ్గరకు వెళ్ళుతాడు. అప్పుడు ప్రహ్లాదుడు ' నీకేం కావాలి?' అని అడుగగా 'నాకు నీ శీలం కావాలి,' అని అడుగుతాడు పేదబ్రాహ్మణవేషం ధరించిన అసలు ఇంద్రుడు. అప్పుడు ప్రహ్లాదుడు చిరునవ్వు నవ్వి, నా శీలం తీసుకొనిన నీకు ఏమి ప్రయోజనం? ఈజగత్తు నందు అనేకసమస్యలు, బాధలూ వుంటున్నాయి. ఇలాంటివాటిని తీర్చుకొనే నిమిత్తమై కోరవలసినవి కోరుకో! అంటాడు. అప్పుడు పేదబ్రాహ్మణవేషంలో వున్న ఇంద్రుడు 'నాకు ఏమియూ అవసరంలేదు. నీ శీలము మాత్రం దానంచేయి' అని అంటాడు. అప్పుడు ప్రహ్లాదుడు 'నా శీలమును నీకు యిస్తున్నాను. అందుకో! 'అంటాడు. తక్షణమే ప్రహ్లాదుని నుండి ఒక దివ్యతేజస్సుతో ఒక పురుషుడు బయటకు వచ్చి ఆ పేదబ్రాహ్మణునిలో ప్రవేశిస్తాడు, ఆ ప్రవేశించడానికి పూర్వం 'నీవు ఎవరవు?' అని ప్రశ్నిస్తాడు ప్రహ్లాదుడు. అప్పుడు ఆ తేజస్వి 'నేను నీ శీలమును, నీవు ఈ పేదబ్రాహ్మణునికి దానం యిచ్చావు. కనుక నేను ఇతనిలో ప్రవేశిస్తున్నాను.' అంటాడు. మరికొంత సేపటికి మరొక తేజస్వరూపుడైన పురుషుడు ప్రహ్లాదుని నుంచి బయటకు వస్తాడు. మరల 'నీ వెవరవు?' అని అడుగుతాడు ప్రహ్లాదుడు, 'నేను ఈ శీలముయొక్క సేవకుడను. ఆ శీలం నీలోలేనప్పుడు, నేను యిక్కడవుండి ప్రయోజనం ఉండదు. కనుక నేనూ అతనిలో ప్రవేశిస్తున్నాను' అని జవాబుచెబుతాడు ఆ తేజస్వరూపుడు. మరికొన్ని నిముషాలకు ఒక సుందరమైన స్త్రీ బయటకువచ్చి, ఆ పేదబ్రాహ్మణునిలో ప్రవేశిస్తుంది. 'అమ్మా! మీరెవరు?' అని ప్రశ్నిస్తాడు ప్రహ్లాదుడు. అప్పుడు ఆమె 'నీ రాజ్యలక్ష్మిని. శీలము లేనిచోట, శౌర్యం లేనిచోట నాకు రక్షణ ఉండదు. కనుక నేనుకూడనూ వారున్న ( శీలము, శౌర్యము) చోటికి వెళ్ళుతున్నాను' అని చెప్పి ఆ పేదబ్రాహ్మణునిలో ప్రవేశిస్తుంది. శీలము అంటే ఎంతో విలువైనటువంటిది. ఆ శీలము లేనపుడు రాజ్యభ్రష్టులవుతుంటారు. అదేవిధంగా ప్రహ్లాదుడు కూడా తన పదవిని కోల్పోతాడు. కనుక శీలం లేని వ్యక్తి ఎందుకూ కొరగాడు. అన్నింటినీ కోల్పోతాడు.

'అస్థిరం యౌవనం ధనం' యౌవనం, ధనం ఎంత కాలముంటాయి?ఇవి కదిలిపోయే మేఘముల వంటివి, ధనం శాశ్వతం కాదు, యౌవనం అంతకన్నా కాదు. గుణం ఒక్కటే సత్యమైనది. దానిని కాపాడుకోవాలి. అదియే ప్రతి ఒక్కరి లక్ష్యం కావాలి. కనుక ప్రతిమానవుని ప్రవర్తనా చక్కగా ఉండాలి. ప్రవర్తన సరీగా లేకపోతే మానవత్వమే మరుగైపోతుంది. సృష్టికంటే మానవత్వం చాలా విలువైనటు వంటిది. సమాజంయొక్క సంక్షేమాన్ని ఆశించాలి. సమాజం సంక్షేమంగా వుండాలంటే వ్యక్తిత్వాన్ని చక్కగా అభివృద్ధి పరచుకోవాలి. ప్రకృతి యందు సృష్టి చాలా ప్రధానమైనటు వంటిది. సృష్టిలో సమిష్టి రెండవది. సమిష్టి తరువాత వ్యష్టి తయారవుతాడు. ఈ వ్యష్టి, సమిష్టి నుండి

ఆవిర్భవించినటువంటివాడే. ఈ సమిష్టి, సృష్టి నుంచి ఆవిర్భవించినటువంటిదే. ఈ సృష్టి, పరమేష్టి నుండి ఆవిర్భవించినటువంటిది. కనుక పరమేష్టి, సృష్టి, సమిష్టి వ్యష్టి - ఈ విధమైన సంబంధం ఒకదానికి ఒకటి కలిసి ఉంటున్నది. సర్వాంగములు కూడి ఏవిధంగా ఒక దేహ స్వరూపాన్ని ధరిస్తున్నాయో, అదే విధముగ ఈ ప్రపంచము నందు కూడా అనేక రకముల ప్రజలు చేరి, ఏకతత్త్వము లోపల, సమాజతత్త్వము అనే లక్ష్యమును వుంచుకొని, సమాజసంక్షేమం కోసం సర్వులూ పాల్గొనాలి. అదియే నిజమైన మానవత్వానికి సరియైన అర్థము.

మానవుడు జన్మించింది కేవలం తిని, తిరిగి, నిద్రించి, చావటానికి కోసం కాదు. పుట్టిన ప్రతిమానవుడు సమాజ సంక్షేమాన్నికోరాలి. సర్వుల క్షేమాన్ని ఆశించాలి. స్వార్థం నుంచి సమిష్టిలో ప్రవేశించాలి. సమిష్టి అనగా సమాజం. ఈ సమాజమును సృష్టిలో ప్రవేశపెట్టాలి. ఈ సృష్టిలో ప్రవేశ పెట్టినప్పుడే, పరమేష్టిని మనం దర్శించవచ్చును. కర్తవ్య కర్మలను విస్మరించి, కేవలం 'పరమేష్టి.. పరమేష్టి..' అంటే ఎట్లా లభిస్తుంది? మానవ జీవితం పవిత్రమైనటువంటిది, ఆదర్శవంతమైనటువంటిది, ఆనందమైనటువంటిది. ఇట్టి జీవితమును బంధనలచేత పాడుచేసుకుంటున్నారు, ఆనందంగా జీవిస్తున్న పిల్లలను కూడా భ్రష్టులను గావిస్తున్నారు. ఈనాడు ప్రపంచంలో యువకుల అవసరం ఎంతైనా ఉన్నది. దేశం ఏ దిశగా పయనిస్తున్నదో గుర్తించాలి. ఎక్కడ చూచినా అల్లకల్లోలములే. ఎక్కడ చూచినా అశాంతే. ఎక్కడా సుఖం అనేది కనిపించటం లేదు. ఎక్కడా లేని సుఖమును నీవు ఏరీతిగా సంపాదించగలవు? ముఖ్యంగా నీయందు సుఖాన్ని అభివృద్ధి చేసుకోవాలి. నీలో వున్నటువంటి సంతోషాన్ని నీవు ఆవిర్భవించుకోవాలి. పవిత్రమైన భావాలను పెంపొందించుకోవాలి.

విద్యార్థిగా ఉన్నప్పుడు ఎన్నో పరిశుద్ధ భావాలు ఉంటుంటాయి. కాని బంధనలలో ప్రవేశించి ఈ పరిశుద్ధమైన భావాలను అపవిత్రం గావించుకుంటున్నారు. ఈ బంధనలలో ప్రవేశించినవారు ఏ సుఖమును పొందు తున్నారు? ఏమీ లేదు. తామే సుఖమును పొందనివారు, ఇతరులకు ఏ విధంగా సుఖమును అందించగలరు? కనుకనే మొదట Self-Satisfaction కావాలి. ఈ Self-Satisfaction Self-Confidence ఉన్నప్పుడు లభిస్తుంది. అప్పుడు Self-Sacrifice చేయగలం. ఎక్కడైనా సరే ఐకమత్యం (Unity) అత్యవసరం. ఐకమత్యం చేత ఎంతటి పనినైనా సాధించవచ్చును. ఈ ఐకమత్యం ఎప్పుడు మనలో వస్తుంది? మనలో Purity (పవిత్రత) ని పెంచు కొనినప్పుడే మనలో Unity వస్తుంది. ఈ రెండూ వున్నప్పుడే మనకు Divinity ప్రాప్తిస్తుంది. కేవలం Divinity - Divinity కావాలి అని ప్రప్రథమంగానే కోరుతూ Unity ని, Purity ని ప్రక్కకునెట్టుతే ఏవిధంగా Divinity లభిస్తుంది? ఇది కలలోని మాట.

**విద్యార్థులారా ! యువకులారా! భక్తులారా!**

మొదట మానవత్వాన్ని గుర్తించండి. ఏమిటి ఈ Human Quality ? సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ, అహింసలు అన్నారు. ఈ మానవతావిలువలు ఎక్కడ నుంచో, మనం కొనితెచ్చుకున్నటువంటివికావు. మనతో పాటే ఈ మానవతావిలువలు కూడా పుట్టాయి. ఇవి మన యందే ఉన్నాయి. మనయందున్నటువంటివాటిని ప్రపంచంలో ఎక్కడనో సాధిద్దామంటే ఇద్ది సాధ్యమయ్యేది కాదు. సాధించలేదు. ప్రపంచమంతా సమిష్టి స్వరూపమే. మానవతావిలువలు వ్యష్టిలో ఉంటున్నాయి. వ్యక్తిత్వాన్ని పోషించుకున్నప్పుడే సమిష్టి స్వరూపాన్ని, ఆనందాన్ని అనుభవించవచ్చును. మానవత్వం యొక్క విలువలను చక్కగా గుర్తించాలి. మానవత్వమనగా కేవలం దేహమును దర్శించటమేకాదు. అందులో వున్నటువంటి విలువలను దర్శించాలి. ఆ విలువలను అనుభవంలో పెట్టాలి. అనుభవంలో పెట్టనప్పుడు ఈ విలువలు నీకు ఏ రీతిగా ఉపకరిస్తాయి? ఉదాహరణకు అగ్గి పెట్టె ఉన్నది. దానిలో అగ్గిపుల్లలు ఉన్నాయి. అది జేబులో పెట్టుకుంటే ఉపయోగపడదు. దానిలోని పుల్లను తీసి అగ్గిపెట్టెమీద రాసినప్పుడే అగ్ని పుడుతుంది. ఆ అగ్ని మనకు ఉపయోగ పడుతుంది. అదేవిధముగనే మానవతా విలువలు అనే పుల్లలు నీ దేహము అనే పెట్టెలో ఉంటున్నాయి. ఆ దేహమనే పెట్టెను సత్కర్మలు, సదాలోచనలు, సచ్చింతనలు, సత్ప్రవర్తనలు అనేటటువంటి వాటిల్లో ప్రవేశపెట్టినప్పుడు, ఈ భావాలు అభివృద్ధియై ప్రకాశవంతమైన జ్యోతిని నీకు అందిస్తుంది.

నీవు విద్యార్థివి. కేవలం అగ్గిపుల్లవంటివాడవు కాదు నీవు Street Light వంటివాడవు. అది ఆ లైటు స్తంభమును కూడా చూపిస్తుంది. ఆ రోడ్డు మీద నడిచేవారికి వెలుగును చూపిస్తుంది. అదే విధముగా నీయందున్న మానవతా విలువలు నిన్ను నీవు తెలుసుకోవటానికి ఉపయోగపడాలి. అంతేకాదు ఇతరులకు కూడా ఉపకారం చేయాలి. దీనిని గురించే Help Ever - Hurt Never అన్నారు. అయితే ఇప్పుడు నీకు నీవు ఉపయోగపడటంలేదు. ఇంకా పరులకు ఏవిధంగా దారిచూపగలవు? ఈనాడు పెద్దలుకూడా బంధనలలో మునిగిపోయి పిల్లలకు సరీగా మార్గదర్శకం చేయలేకపోతున్నారు. పవిత్రమైన మార్గంలో ప్రవేశించి, లోకంలోని అశాంతిని రూపుమాపాలి. దుర్మార్గమును దూరంగావించాలి. అయితే ఈనాడు దుర్మార్గపు ఆలోచనలు లోపలపెట్టుకొని, పైకి శాంతి.. శాంతి.. అని కేకలు వేస్తున్నారు. ఏవిధంగా శాంతివస్తుంది? బంధనలను దూరం చేసు కోవాలి. సమాజంలో ప్రవేశించాలి, సేవలలో ప్రవేశించాలి. అప్పుడే నీకు ఆనందం కలుగుతుంది. ఈ ఆనందమును అభివృద్ధి పరచుకొని అనుభవించి పదిమందికి పంచాలి.

ఈనాటి పిల్లలలో 'త్యాగం' అనేది ఎక్కడా కనిపించటంలేదు. త్యాగమే లేనప్పుడు, యోగం ఏ రీతిగా మనకు లభిస్తుంది? ఎంత సంపాదించినా తృప్తి లేకుండా పోతున్నది. ఎంత అనుభవించినా శాంతి కలుగటంలేదు. ఉన్నదానితో తృప్తిపడటం నేర్చుకోవాలి. 'అసంతృప్తో ద్విజోనష్టః' అసంతృప్తిగలవానికి అన్నీ నష్టములే కలుగు తుంటాయి.

'హస్తస్యభూషణం దానం'. హస్తములు మనకు భగవంతుడు యిచ్చింది. పరులను కొట్టటానికికాదు. చెడుపనులు చేయటానికి అంతకన్నాకాదు. హస్తములతో ఉపకారం చేయాలి. దానధర్మాలు చేయాలి. ఈ హస్తములను పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. ఉపకారములే చేయాలిగాని అపకారములు చేయకూడదు. అపకారం చేయడానికి పూనుకుంటే, నీ జీవితమే అపమార్గంలో పడిపోతుంది. పవిత్రమైన మార్గంలో ప్రవేశించండి. లోకంలో శాంతిని నెలకొల్పండి. మీరు చదివిన చదువులు దేశోద్ధారణకు ఉపయోగపడాలి. స్వప్రయోజనం కోసంకాదు. మీరు చదివిన చదువులు పరులకు ఉపయోగపడాలి. పరులకు ఉపయోగపడని చదువులు నేర్చి ఏమి ప్రయోజనం? మీరు నేర్చిన చదువులు పరులకు ఉపయోగపడాలి.

నేను ఈ మధ్య ఒక విషాదకరమైన వార్తను పత్రికలలో చూచాను. ఒక అమాయకురాలైన తల్లి, తన ముగ్గురు పిల్లలను సాకలేక, ఆకలి అమ్మా! అంటుంటే అన్నం పెట్టలేక, ఆ పిల్లలకు విషం యిచ్చింది, తాను త్రాగింది అందరూ మరణించారు. ఆ వార్తను చూచి నేను చాలా బాధపడ్డాను. నా హృదయం ద్రవించింది. ఇది నిజంగా దురదృష్టకర సంఘటన. నేను ఇప్పటివరకు ఎన్నో పనులు చేసాను. కోట్లాది రూపాయలు ఖర్చుచేసి, విద్యా సంస్థలను నెలకొలిపి, ఉచితంగా చదువు చెప్పిస్తున్నాను. వందల కోట్లరూపాయిలు వెచ్చించి రెండు సూపర్ స్పెషాలిటి ఆసుపత్రులు నిర్మించాను. (పుట్టపర్తి, బెంగుళూరు). లక్షలు వెచ్చించినా నయంకాని వ్యాధులకు ఉచితంగా చికిత్సలు చేయిస్తున్నాను. వేలాదిమందికి ఉచితంగా గుండె ఆపరేషన్లు కూడా చేయిస్తున్నాను. మరియు వందలకోట్ల రూపాయిలు ఖర్చుచేసి ఉచితంగా వందలాది గ్రామాలకు మంచినీటిని అందిస్తున్నాను. విద్య. వైద్యం, నీరు - ముఖ్యమైన ఈ మూడు ఉచితంగా అందిస్తున్నాను. పేద పిల్లలను పోషించే నిమిత్తమై ఇప్పుడు ఒక క్రొత్త ప్లాన్ వేస్తున్నాను. అనంతపూర్ జిల్లాలో నా విద్యార్థులను, అధ్యాపకులను సర్వే చేయించడానికి నవంబర్ 1వ తేదీ గ్రామాలకు పంపుతున్నాను. పేద పిల్లలకు అన్నం పెట్టి, ఉచితంగా వస్త్రములనిచ్చి, చదువు చెప్పించి, వారికి సమాజంలో గౌరవప్రదమైన స్థానం కలిపించాలని సంకల్పించుకున్నాను. మొదటి దశలో వెయ్యి పేద కుటుంబాలను గుర్తించి, ఒక్కొక్క కుటుంబానికి లక్షరూపాయల చొప్పున Fixed Deposit చేసి, వచ్చే వడ్డీ ద్వారా ఆ పేద పిల్లలకు అన్నం, వస్త్ర సౌకర్యములు ఏర్పాటుచేసి, మా విద్యార్థులచేత వారికి ఉచితంగా విద్యను నేర్పించాలని సంకల్పించుకున్నాను. క్రమక్రమేణా ఈ పథకమును అభివృద్ధిపరచదలిచాను. ఈ నవంబర్ 1వ తేదీ నుంచి దీనిని ప్రారంభిస్తున్నాను. కొన్ని లారీలలో చీరెలు, పంచెలు, పిల్లలకు చొక్కాలు, నిక్కర్లు మరియు అన్నం ప్యాకెట్లు యిచ్చి పల్లెలలో పంచడానికి మా విద్యార్థులను పంపుతున్నాను. ఇంతేకాదు, నా సంకల్పం వజ్ర సంకల్పం.

**నా ఆలోచనలు ఎప్పుడూ పరోపకార సంబంధమైనవిగానే ఉంటాయి. స్వార్థమనేది నాలో ఎక్కడా కనిపించదు. ఆ బీదకుటుంబాలకు తలా ఒక చిన్న ఇల్లు కూడా నిర్మించాలని నా సంకల్పం. అందులో తల్లిదండ్రులకు ఒక గది, పిల్లలుండటానికి మరోగది. మరియు చిన్న వంటగది, స్నానాలగది కూడా ఉంటాయి. ఈ విధంగా ప్రథమ దశలోనే వేయి పేద కుటుంబాలకు సహాయం చేయదలిచాను.**

విద్యార్థులారా! ఈ పవిత్రమైన కార్యక్రమంలో మీరందరూ పాల్గొనాలి. ధనసంపాదన కోసం మీరు బయటకు పోకూడదు. నిజంగా మీరు బయటకుపోతే భిక్షమెత్తిన వారవుతారు. ఇక్కడ ఏ విధమైన ఖర్చులేకుండా మీరు చదివినారు. బయటకుపోయి ఇష్టం వచ్చినట్లుగా సంపాదించుకుంటూ కూర్చుంటే దీనివలన వచ్చిన ఫలితమేమిటి? మీరు కూడా ఉన్నటువంటివారు కాబట్టి మీరు కూడా ఈ సేవలలో ప్రవేశించాలి. మీ పరిస్థితి నేను చూచుకుంటాను. మా తండ్రి ఎట్లా? అని మీరు సందేహించ నవసరంలేదు. ఉపకారం చేసినవారికి, దైవం ఎప్పుడూ అపకారం చేయడు. విశాలమైన భావాలను పెంచుకోండి. సంకుచిత భావాలను విడనాడండి. దుర్మార్గములలో ప్రవేశించకండి. అయితే ఈనాడు చాలామంది అపవిత్రమైన మార్గములలో ప్రవేశించి, పశువులకంటే హీనంగా ప్రవర్తిస్తున్నారు. కాని, ఇన్ని విన్నటువంటి మీరు పశువులు కాకండి. 'నేను' మానవుడ్ని అని చింతించండి. మానవతా హృదయాన్ని అభివృద్ధి పరచుకోండి. పశుగుణములను దూరం చేసుకోండి. పశువులు ఏ చదువులూ చదువలేదు, ఏ డిగ్రీలు తీసుకోలేదు. భుజిస్తున్నాయి, వంటిని వంచి పని చేస్తున్నాయి. మనం కూడా పని చేయాలి. కర్తవ్యకర్మల నాచరించాలి. పల్లెలలోనున్న పిల్లలను ఉద్ధరించాలి. వారికి చదువులు నేర్పించాలి. సద్గుణములను నేర్పాలి. సరియైనవారిగా తీర్చిదిద్దాలి. ఈ విధంగా పనులుచేస్తూ పోతే, పవిత్రమైన భారతదేశము తిరిగి దేదీప్యమానంగా ఆదర్శవంతమైన భారతదేశంగా రూపొందుతుంది. ఈ విధమైన కార్యములలో మీరు ప్రవేశించి, సరియైనటువంటి మానవత్వాన్ని మీరు నిలుపుకుంటారని నేను ఆశిస్తున్నాను.

మీరు చదువుకున్నవారు. చదువుకున్నవారికి ఒక Season ఒక Reason ఉంటుంది. కాని Season, Reasonలేని మృగాలవలె మీరు కూడనూ ప్రవర్తించ కూడదు. మీరు అసత్యమాడకూడదు, అన్యాయం చేయకూడదు, అక్రమాలలో ప్రవేశించకూడదు. అప్పుడే మీరు ఆదర్శప్రాయులైన విద్యార్థులుగా రూపొందుతారు. సత్యసాయి ఇనిస్టిట్యూట్‌కు పేరుప్రతిష్ఠలు తెచ్చిన వారవుతారు. మీనుండి నేను ఏమీ కోరటంలేదు. ఎక్కడికి పోయినా మీరు మంచిపేరు తెచ్చుకోండి. స్వామి ఆశయాలను ఆచరణలో పెట్టండి. ఆశయాలకు తగినట్లుగా నడచుకోండి.

అన్నింటికీ ముఖ్యమైనటువంటిది 'ప్రేమ'. ప్రేమ ఒక్కటివుంటే మనం ఏపనినైనా ఆనందంగా చేయగలం. కనుక ప్రేమను పెంచుకోండి. ఎలాంటి ప్రేమ. స్వార్థరహిత మైన ప్రేమ, స్వప్రయోజనరహితమైనటువంటి ప్రేమ. అటువంటి ప్రేమను పెంచుకొనినప్పుడే మీరు దేనినైనా సాధించగలరు. ఈ ప్రేమ హృదయము నుండి ఆవిర్భవించాలిగాని బయటనుంచి కూరేటటువంటిదికాదు. కనుక మనం ప్రపంచమంతా ఇట్టి ప్రేమతత్వాన్ని చాటుతూ పోవాలి. కనుక మొట్టమొదట మీరు బాగుపడి, ఇతరులు బాగుపడటానికి ప్రయత్నం చేయండి. ఈ విధమైన మార్గంలో మీ జీవితాలను సార్థకం చేసుకోండి.

'సత్యం, ప్రేమ ద్వయం స్థిరం' ఈ రెండే స్థిరమైనటు వంటివి, శాశ్వతమైనటువంటివి. ఈ ప్రేమను మీ వెంట తీసుకొని వెళ్ళండి. అది మీ వెంట, జంట, ఇంట, కంట వుండి, అన్ని విధములా మిమ్ము కాపాడుతూవస్తుంది. ప్రేమకు ద్వేషము లేదు. దీనికి గొప్ప విలువ ఉన్నది. ఇలాంటి విలువను పాడు చేసుకోకండి. ప్రేమ నిర్మల మైనటువంటిది, నిస్వార్థమైనటువంటిది, నిశ్చలమైనటు వంటిది, అమృతమయమైనటువంటిది. మీరు అమృత పుత్రులు, అనృతపుత్రులు కాకండి. కనుక మీరు ప్రేమ స్వరూపులుకాండి. ఇది సత్యమైనటువంటి తత్వము, నిత్యమైనటువంటి పేరు. ఇలాంటి పేరును మీరు నిలబెట్టుకోండి. ఇలాంటి పేరుతో మీరు జీవించండి. ఆ విధమైనటువంటి జీవితాన్ని, మీరు గడుపుతూ వచ్చినప్పుడే, మా కాలేజీలో చదివినందులకు - నేను చదివించినందులకు అదే స్వామికి సంతోషం. ఈనాడు సమాజంలో ఎంతో మంది ఎన్నో అవస్థలు పడుతున్నారు. ఈ అవస్థలను సాధ్యమైనంత వరకు, మీ శక్తి కొలది దూరం చేసి, మీరు తరించి , పరులను కూడా తరింపజేసి, దేశానికి గొప్ప కీర్తిని తేవాలి.

మీరు వ్యక్తిగతంగా సేవలలో ప్రవేశించకూడదు. దేశంలో వున్నటువంటి సంస్థలన్నీ నాయొక్క సంస్థలని నీవు అనుకోవాలి. అందరూ సమిష్టిగా పోండి. మనము... మనము... We.. We.. అనే భావాన్ని పెంచుకోండి. I అనే దానిని ఎక్కడా ఉపయోగపెట్టకండి. అందరూ సోదర సోదరీ మణులే. భగవంతుణ్ణి 'మాత, పిత' అని సంబోధిస్తున్నారు. అప్పుడు మీరందరూ ఎవరు? బిడ్డలే. కనుక బిడ్డలందరూ సోదరసోదరీమణులే. కాని మన ఆస్తిలో మనం భాగం పంచనవసరం లేదు. మీ ఆస్తిని మీరు ఉంచుకోండి. కాని, సోదరులుగా మీరు ప్రవర్తించండి. ఒకవేళ అవసరమైతే మీ ఆస్తిని కూడా పంచిపెట్టటానికి సిద్ధంకాండి. అదియే నిజమైనటువంటి త్యాగము. అలాంటి పవిత్రమైన త్యాగానికి మీరు కంకణం కట్టి, ప్రేమకు హస్తం అందించి, సత్యానికి తోడ్పాటు నిచ్చి దీక్షతో సాధనలు చేయాలి.

విద్యార్థులారా! ఇది ఆనందకరమైన దినం. పల్లెపల్లెలకు వెళ్ళండి. స్త్రీలకు చీరెలు, పురుషులకు పంచెలు, పిల్లలకు పాంటు, షర్టులు, ఆడపిల్లలకు గౌన్లు పంచి పెట్టండి. మీరుమాత్రమే గొప్ప విలువైనటువంటి డ్రస్సులు వేసుకుంటే ప్రయోజనం లేదు. మీ సోదరసోదరీమణులకు కూడా విలువైనటువంటి డ్రస్సులు యివ్వాలి. వాళ్ళు కూడా మంచి డ్రస్సులు వేసుకొని ఆనందించాలి, మీకు ఆనందాన్ని అందించాలి. అప్పుడే అది నిజమైన ఆనందం అవుతుంది. కాని వాళ్ళు మాసిపోయిన దుస్తులు వేసుకుంటే మీకు అవమానం కాదా? ఇలాంటి మానవతా విలువలను మీరు పెంచుకోవాలి. సమభావాన్ని పెంచుకోవాలి. సమిష్టిగా జీవించాలి. ఈ పనినంతా నవంబర్ 1వ తేదీనుంచి ప్రారంభించాలి. సిద్ధంకాండి.

*(ది. 6.10.2000 న ప్రశాంతినిలయంలో విజయదశమి సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగము నుండి)*

**ఎందరో మహానుభావులు - 32**

# నంగా బాబా

హిమాలయాలలో ఒక వ్యక్తి తిరుగాడుతూ వుండేవాడు. ఒంటిపైన నూలుపోగయినా వుండేదికాదు. అంతా అతడిని 'నంగాబాబా' (హిందీలో నంగా అంటే దిగంబర అని అర్థం) అనేవాళ్ళు. 'నీవెవరు?' అనెవరయినా అడిగితే అతడు 'నేనొక హంతకుడిని' అని చెప్పేవాడు. నిజానికి అతడొక హంతకుడే! అతని స్వగ్రామంలో ఒకసారి భూమికి సంబంధించి తగాదా వచ్చింది. అందులో అవతలి పక్షం వాళ్ళతని తండ్రిని చంపేశారు. ఈ సంగతి తెలియగానే ఇతడు వెళ్ళి పరశురామునిలా విజృంభించి తండ్రి హంతకులను అయిదుగురినీ నరికిపారేసి హిమాలయాల్లోకి పారిపోయివచ్చాడు. అక్కడ అతడెప్పుడూ సాధువుల సాంగత్యం చేస్తూ ఆధ్యాత్మిక సాధనలు చేస్తూవుండేవాడు. చిత్తశుద్ధి కలవాడు కనుక ఎవరు 'నీవెవర'ని అడిగినా హంతకుడని నిజమే చెప్పేవాడు. కాని జనం నిజం చెబితే నమ్మరు గదా! అతడొక యోగి గనుక అతడి జవాబులో ఏదో అంతరార్థం, ఆధ్యాత్మిక సత్యం ఉండివుంటుందని అనుకొనేవారు.

ఇలా దాదాపు పాతికేళ్ళు గడిచాయి. ఒకరోజు ఒక సాధు వక్కడికి వచ్చి, ఈ బాబాను చూసి నీవెవరు? అనడిగాడు. ఆయన వెంటనే 'నేనొక హంతకుడినని' జవాబిచ్చాడు. 'నీవు హత్యచేసిందెవరిని? ఆ కథంతా చెప్పు' అన్నాడా సాధువు. అక్కడివారంతా వినేలా అతడా కథంతా చెప్పాడు. అప్పుడా సాధువు 'నాయనా! నీ సత్యసంధత ప్రశంసనీయం. కాని నీవు రాజదండన స్వీకరించాలి. కనుక మీ వూరు తిరిగి వెళ్ళి పోలీసులకు లొంగిపోయి, నీ వృత్తాంతమంతా చెప్పు, శుభం కలుగుతుంది! అని సలహా ఇచ్చాడు.

నంగాబాబా అలాగే తన వూరికివెళ్ళి సమీప పోలీస్ స్టేషన్‌లో తన కథంతాగా చెప్పాడు. పోలీసులు రికార్డంతా తిరగేశారు. కేసులేదని చెప్పారు. దానిపై నంగాబాబా కోర్టుకు పోయి జడ్జికి తన కథంతా చెప్పాడు. జడ్జి విచారించి 'అలాంటి కేసు ఏదీ రికార్డు కాలేదు' అని అతడిని విడుదల చేశాడు. నంగాబాబా తన సాధనలను కొనసాగించేందుకు హిమాలయాలకు తిరిగి వెళ్ళాడు.

(శ్రీరామ రచించిన 'హిమాలయ యోగులు' ఆధారంగా)

- భండారు పర్వతాలరావు

# ధనం దానం చేయాలి

"దానం భోగో నాశస్త్రి స్రో
గతయో భవంతి విత్తస్య
యోన దదాతి న భుంక్తే
తస్య తృతీయా గతిర్భవతి"

ధనానికి మూడు విధములైన అవస్థలున్నాయి. ధనం ఒకరికి ఇవ్వడం వలన నశించిపోతుంది. లేదా మనం అనుభవించినా తరిగిపోతుంది. ఈ రెండూ కాకపోతే మరెవరైనా అపహరించినప్పుడు కూడా ధనం పోతుంది.

పుట్టిన ప్రతి మానవుడు ధనమును సంపాదించ వలసినదే. అయితే తాను సంపాదించిన సంపదను, తన న్యాయసమ్మతమైన అవసరాలకు కొంత ఖర్చు పెట్టుకొన వచ్చును. మరికొంత దానధర్మములకు, పుణ్యకార్యములకు సద్వినియోగపరచాలి. అంతేగాని తాను తినక, ఇతరులకు పెట్టక, దాచివుంచుతే 'కూచమ్మ కూడపెడితే మాచమ్మ మాయం చేసింది' అన్నట్లుగా మధ్యలో ఎవరో వచ్చి దానిని ఎత్తుకొని పోతారు. ఇదే వాస్తవమును వేమన కూడా చక్కగా చెప్పాడు.

"ధనము కూడబెట్టి దానంబు చేయక
తాను తినక లెస్సదాచుకొనగ
తేనెటీగ గూర్చి తెరువరికియ్యదా
విశ్వదాభిరామ వినురవేమ"

తేనెటీగ తాను పెట్టిన తేనెపట్టు దరికి ఎవరినీ చేరనీయదు, తాను త్రాగదు. చిట్టచివరికి దారినపోయే దానయ్య ఆ తేనెపట్టును కొట్టి ఆ తేనెను ఆస్వాదిస్తాడు. అదేవిధముగ లోభిదాచిన సొమ్ము కూడా చిట్టచివరికి ఎవరో ఒకరు సంగ్రహిస్తారు.

పుట్టిన ప్రతి జీవి పుట్టుకతోనే ధనం తీసుకొనిరాడు, పోయేటప్పుడు తీసుకొనిపోడు. మరణించిన తరువాత ప్రతి మనిషి తన వెంట తీసుకొనిపోయేది తాను సంపాదించిన ధనంకాదు. తాను సంపాదించిన ధనముతో ఆచరించిన పాపపుణ్యకర్మఫలమును మాత్రమే. కనుక తాను సంపాదించిన ధనమును నీతి ధర్మాలతో సత్కర్మము లకు వినియోగించినప్పుడే అట్టి ధనమునకు సార్థకత ఏర్పడుతుంది. ఇహపరసుఖములను పొందగలుగుతాడు. మానవ జన్మ సాఫల్యమవుతుంది.

**సాయిప్రియ**

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు కూడా ఇదే వాస్తవమును తెలియజేశారు.

"ధనము వచ్చును పోవును ధరణియందు
నీతిధర్మాలు నిలుచును నిజముగాను
నీతిధర్మాలు హృదయాన నింపుకొన్న
సార్థకంబగు మానవజన్మ భువిని"

కనుక మనం దాచుకోవలసింది ధనంకాదు. ధనం దానం చేయాలి. నీతి ధర్మాలు హృదయంలో నింపుకోవాలి. అట్టి మానవజన్మ సార్థకమవుతుంది. ●

శోకాలుసమయించి లోకాలనేలంగ
దివినుండివచ్చిన దేవదేవ
అవతార పురుషుల ఆర్షలక్ష్యము లేవొ
విశదమయ్యెను నేడు వేదవేద్య
క్రమశిక్షణలులేని కుమతులకందదు
దివ్యతత్త్వమనుచు తెలియవచ్చె
సంకల్పమాత్రాన జగతినాకర్షించు
భక్తజనోద్ధార పర్తివాస
శ్వాస వదలిపోయెడిదాక సాయిచెంత
ఆత్మచింతనాసాధన లమలుపరచు
శక్తినొసగుము తండ్రి! ప్రశాంతివాస
నిత్యమానందమందించు సత్యసాయి

- పంచాంగము శీనప్పశాస్త్రి

# దరిద్రనారాయణసేవలో జన్మసార్థకం చేసుకున్న స్వామిని శారదా ప్రియానంద

బందరు పట్టణంలో ప్రభవించిన కొందరు ఆధ్యాత్మిక వేత్తలు పీఠాధిపతులయి, పీఠస్థాపకులయి ఆధ్యాత్మిక వెలుగులను దేశమంతటా వెదజల్లారు. దక్షిణాదినగల కుర్తాళ పీఠానికి వరుసగా ఇద్దరు బందరు వాస్తవ్యులు కె.టి. రామారావు (త్రివిక్రమానందభారతీస్వామి) చిట్టూరి రామకృష్ణారావు (విమలానంద భారతీస్వామి) అధిష్ఠించారు. బందరు, గొడుగుపేట వాస్తవ్యులయిన రాళ్లబండి సీతారామ శాస్త్రిగారు (విద్యానందభారతీస్వామివారు) గాయత్రీపీఠాన్ని నెలకొల్పి, శంకరమఠాన్ని నిర్మించి, శంకరమఠ నిర్మాణాలను శంకర భగవత్పాదుల సందేశ వ్యాప్తిని ఒక మహోద్యమంగా నిర్వహించారు. స్వామి చిన్మయానంద అనుంగు శిష్యురాలయి, స్వామి సందేశాన్ని ఈ దేశమంతటనేకాక విదేశాలలో కూడా చాటిన బ్రహ్మచారిణి మాత శారదా ప్రియానంద. ఆమె తన ఆధ్యాత్మిక గురువు చిన్మయ సందేశాన్ని వ్యాపింపచేయడమేకాక అనాథాశ్రమాలను నిర్మించి, గ్రామాలను చైతన్యవంతం చేసి దరిద్రనారాయణ సేవలో మాధవుని దర్శించిన మాతృ స్వరూపిణి ఆమె.

ఆమె బందరు, ఖొజ్జిల్లిపేట వాస్తవ్యులయిన దుగ్గి పట్టాభిరామయ్య, వెంకట రమణమ్మగార్ల నాల్గవపుత్రికగా 1927 ఏప్రియల్ లో జన్మించారు. పట్టాభి రామయ్యగారు బందరు హిందు హైస్కూలులో చాలా సంవత్సరాలు గణిత ఉపాధ్యాయునిగా పనిచేశారు. ముక్కు సూటి మనిషిగా ఎవరినీ లెక్క చేయని వ్యక్తిగా పేరుతెచ్చుకున్నారు. 1920 దశకంలో బందరు, ఖొజ్జిల్లిపేటలో కో-పరేటివ్ అర్బన్ బ్యాంకును స్థాపించారు. అది దినదిన ప్రవర్ధమానమయి రాష్ట్రంలోని అగ్రగణ్య అర్బన్ బ్యాంకులలో ఒకటిగా నిలిచింది. 19, 20 దశకంలోనే ఆయన విద్యా విషయిక విషయాలను చర్చించే 'విద్య' అనే మాసపత్రికను స్థాపించారు. విద్య అంటే మక్కువ ఎక్కువ అయినందు వల్లనే తన మూడవకుమార్తెకు 'విద్య' అని, నాలుగవ కూతురుకు 'శారద' అని పేరు పెట్టారు.

పట్టాభిరామయ్య గారి భార్య వెంకట రమణమ్మ గారు కొమ్మూరి వారి ఆడబడుచు. ప్రఖ్యాత రచయిత గుడిపాటి వెంకటాచలం గారికి స్వయాన సోదరి. కొమ్మూరివారి యింట జన్మించిన బాల. గుడిపాటి వారికి దత్తువెళ్లారు. రమణమ్మ గారు 1930 దశకం చివరిలో మధ్యతరగతి మహిళలలో చైతన్యం కలిగించి వారిని విద్యావంతులుగా వివేచనా పరులుగా, బాధ్యతగల గృహిణులుగా తీర్చిదిద్దడానికి మహిళా సేవామండలిని స్థాపించి ఆదర్శప్రాయంగా నడిపారు. అవి మహాత్మాగాంధీ గారి నాయకత్వంలో స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా జరుగుతున్న రోజులు.

## కంచి వాసుదేవరావు

గాంధీజీ ప్రభావం పట్టాభిరామయ్య దంపతులపై పడింది. ఖద్దరుధారణను దీక్షగా చేపట్టారు. వారివి స్వతంత్రభావాలు - అందువల్లనే తమ బిడ్డలను క్రమశిక్షణతో పెంచారే తప్ప వారిని తమ నమ్మకాలకి కట్టడి చేయలేదు. స్వంతంగా ఆలోచించమని ఒక నిర్ణయం తీసుకోగల శక్తిని కలిగించారు. తమ బిడ్డలు తీసుకున్న నిర్ణయాలు తమకు సమ్మతం కాకపోయినా - వారి నిర్ణయాలకు అడ్డు చెప్పలేదు.

ఇటువంటి వాతావరణంలో శారద జన్మించింది. తండ్రి ముక్కుసూటితనం, నిర్భయత్వం, తల్లి సేవాభావం, మహిళాభ్యున్నతి, దీక్ష వంటి గుణాలు శారదకు అబ్బాయి. తల్లిదండ్రుల వలెనే ఆమెది కూడా స్వతంత్ర ప్రవృత్తి. బందరులో బి.ఎ. వరకు చదివింది. విద్యార్థులకు జరుగు తున్న అన్యాయాలను ఎదిరించినందులకు హిందూకళాశాల ప్రిన్సిపాల్ కాజ శివరామకృష్ణారావు గారి ఆగ్రహానికి గురి అయింది. అది పూర్తి అయిన తర్వాత లా డిగ్రీని తీసుకుంది. బందరులో వున్నంత కాలం తల్లి స్థాపించిన మహిళా సేవా మండలి కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంది. సేవా దృక్పథం అప్పటికే ఆమె జీవితాశయం అయింది.

బందరులో కొన్నాళ్ళు తురగా వెంకట్రావు గారి వద్ద జూనియర్ లాయర్‌గా పని చేసారు. కాని న్యాయవాద వృత్తి ఆమెను ఆకర్షించలేకపోయింది. మహిళలకు ఉద్యోగరీత్యా సేవ చేయడానికి వీలు కలుగుతుందన్న ఉద్దేశంతో

దుర్గాబాయి దేశ్‌ముఖ్ స్థాపించిన మహిళా సంక్షేమ శాఖలో ఉన్నతోద్యోగంలో కొంత కాలం పని చేసింది. కాని ఆమె ప్రవృత్తికి ప్రభుత్వోద్యోగ వ్యవస్థ సరిపడలేదు. ఇది కాదు తన జీవన గమ్యం అని ఆమె గ్రహించింది. నివురు కప్పిన నిప్పులా వున్న ఆధ్యాత్మిక చింతన మేల్కొంది. ప్రతి ఉదయం ఖంగుమనే కంఠంతో భక్తి గీతాలు పాడుకొని పరవశించడం ఆమెకు అలవాటు, తన ఆధ్యాత్మిక సాధనలో జ్ఞాన జ్యోతిని వెలిగించగల సద్గురువు కోసం అన్వేషణ ప్రారంభమయింది. భక్తుడు సాధకుడైన శిష్యుడు తన జన్మను తరింపచేసుకోవడానికి. సద్గురువు కోసం అన్వేషించినట్లే సద్గురువు కూడా తన జీవితాన్ని చరితార్ధం చేయగల శిష్యుని కోసం అన్వేషిస్తూ వుంటాడు. ఒక శుభముహూర్తాన వారి అన్వేషణ ఫలిస్తుంది. అప్పుడు గురుశిష్యులకు అవినాభావ సంబంధం ఏర్పడి లోకోపకారం జరుగుతుంది. శారద జీవితంలో కూడా అదే జరిగింది. ఆమె అన్వేషిస్తున్న సద్గురువు చిన్మయానందస్వామి రూపంలో కన్పించారు. తను అన్వేషిస్తున్న ఆదర్శశిష్యురాలిని శారద రూపంలో స్వామి చిన్మయానంద చూడగలిగారు. ఇది ఎన్ని జన్మల గురుశిష్యుల అనుబంధమో.

చిత్రమేమంటే ఆమె ఒకసారి 1957-58లలో చిన్మయానందస్వామి ఉపన్యాసాన్ని బందరులో విన్నప్పుడు శారదపై ఎట్టిప్రభావం కలుగలేదు. పైగా ఆయన స్త్రీలపై చేసిన వ్యాఖ్యల వలన ఆయనపై ఒక విధమైన విముఖభావం కలగడానికి కారణమయింది.

తర్వాత 1961లో ఆమె మరోసారి చిన్మయానంద స్వామి ఉపన్యాసం విన్నారు. అపోహలు, అపార్ధాలు మంచు తెరలా కరిగిపోయాయి. కళ్లముందు తను చూడాలనుకున్న జ్ఞానజ్యోతి కన్పించింది. తర్వాత మరి కొన్ని సార్లు ఆమె చిన్మయానందను కలుసుకొన్నారు. అయిస్కాంతంలా గురువు తన శిష్యురాలిని ఆకర్షించారు. తన మార్గమేమిటో తెలిసింది. 1971లో చిన్మయానంద బొంబాయిలో నిర్వహించిన బ్రహ్మచారిణిల శిక్షణాశిబిరంలో శారద పాల్గొంది. స్వామి చిన్మయానంద ఆదేశానుసారం ఆమె ఐహికబంధాలను, మమతానురాగాలను త్యజించి 1977శివరాత్రి నాడు సన్యాస దీక్ష స్వీకరించారు. శారద ప్రియానందగా మారారు. తమ బిడ్డలందరినీ వదలుకుని సన్యాసిని కావడం వృద్ధతల్లిదండ్రులయిన పట్టాభిరామయ్య - రమణమ్మ గార్లకు తీరని ఆవేదన కలిగించింది. తమ కూతురు ఎన్నుకున్న మార్గానికి వారు అడ్డుగా నిలవలేదు. సన్యాస దీక్ష స్వీకరించినప్పటి నుండి పార్ధివ శరీరాన్ని త్యజించే వరకు దాదాపు 23 సంవత్సరాలు చిన్మయానంద సందేశాన్ని వాడవాడలా ప్రచారం చేయడానికి ఆమె తన జీవితాన్ని అంకితం చేసింది. గురువుతో పాటు అనేక చిన్మయానంద తలపెట్టిన జ్ఞాన యజ్ఞాలలో పాల్గొన్నారు. గురువు ఆదేశానుసారం స్వయంగా కొన్ని జ్ఞాన యజ్ఞాలు నిర్వహిస్తూ తన ప్రసంగాలతో భక్తులను ఆకట్టుకునేవారు. ఆమె ప్రసంగాలు సరళంగా క్రమబద్ధంగా వుండేవి. ఆమెలో మరో విశేషం వుండేది. గురువు చిన్మయానంద అభిప్రాయాలను ఒక్కొక్కసారి తను విభేదించినప్పుడు శారదా ప్రియానంద ధైర్యంగా ఆ విషయాన్ని గురువుగారికి చెప్పి తన తార్కిక నిపుణతతో ఆయనకు నచ్చచెప్పగలిగే వారు. ఈ విశిష్ట లక్షణం చిన్మయానందను ఆకట్టుకుంది. అందువల్లనే ఆమె పట్ల ప్రత్యేకమైన అభిమానాన్ని ప్రదర్శించేవారు. ఆమె పట్ల ప్రశంసాభావం కూడా వుండేది. స్వామి చిన్మయానంద శారదాప్రియానంద కలసి గుంటూరులో ఒకసారి జ్ఞానయజ్ఞాన్ని నిర్వహించారు. నరసారావుపేట, కోటప్పకొండ సమీపంలో భక్తులు కొంత స్థలాన్ని కేటాయిస్తే అక్కడ త్రిమాట బ్రహ్మారణ్యంగా అభివృద్ధి పరిచారు. స్వామి శారదాప్రియానంద ధర్మవీర శిక్షణా శిబిరాన్ని

## విక్రమగ్రీష్మం

విడలు తావులొలసివెదజల్లవననేల?
    చిగురులెండిన చెట్టు చిన్నపోవ
శిశులకై పక్షులు చింతిల్లెననేల?
    నిలువ తమకు గూడునీడ వోప
యేళ్ళు పాఱవు చెఱ్వులెండిన నేల?
    బాటసారికిలేదు నీటి చుక్క
వడగాలి యుడికింప వగపేల? పొలముల
    తూలి గోమాతలు సోలుచుండ
ఈ జగత్రయమందు నేనైకచండ
కిరణబాణప్రయోగసంక్లిష్టుడగుచు
చెండుచుండె నిప్పులను మార్తాండుడనగ
భీష్మమయ్యెను విక్రమగ్రీష్మ ఋతువు

- పృథివి సుబ్బనాగయ్య కవి

నిర్వహిస్తే ఆ స్ఫూర్తితో స్వామీజీ ముంబాయిలో కూడా ఇటువంటి ధర్మశిక్షణా శిబిరాన్ని నిర్వహించడం విశేషం.

ఒకసారి స్వామి చిన్మయానందతో కలసి వెళ్తున్నప్పుడు ఆయన శారదాప్రియానందను చూచి ఎన్నాళ్లు యిలా తిరుగుతావు? ఎక్కడో అక్కడ స్థిరపడరాదా అని అన్నారు. ఈ సూచన లోని అంతరార్థాన్ని శారదాప్రియానంద గ్రహించారు. ఆమె జీవితం మరో ఆదర్శప్రాయమైన మలుపు తిరిగింది.

దరిద్ర నారాయణ సేవయే మాధవసేవ అని ఆమె దృఢంగా నమ్మేవారు. అందులోనూ కాయకష్టం చేసుకునే బడుగుజీవులూ, నిరక్ష్యరాసులూ, దిక్కుమొక్కు లేని అనాధలను ఉద్ధరించడం నిజమైన మాధవసేవగా ఆమె గుర్తించారు. కుగ్రామలలోకెల్లా ఒక కుగ్రామం నుంచి మానవ సేవ చేయాలని ఆ గ్రామాన్ని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దాలని ఆమె భావించారు. ఇంధుకు ఆమె ఎంపిక చేసుకున్న గ్రామం కడప జిల్లాలోని ఎల్లయ్యపల్లి.

ఎల్లయ్యపల్లి ప్రతి సంవత్సరం అనావృష్టికి గురిఅయ్యే కుగ్రామం. ఆ గ్రామంలో ఆశ్రమాలను నిర్మించు కోవడానికి ఎవరో 24 ఎకరాలను దానం చేశారు. ఎకరం ఖరీదు ఐదురూపాయలు కూడా చేయదంటే ఆ భూమి ఎటువంటిదో అర్థమవుతుంది. ఆ గ్రామంలోని ప్రజలు కాయకష్టంచేసుకుని జీవించే నిత్యదరిద్రులు. అక్షరం ముక్క తెలియని అజ్ఞానులు. ఆ గ్రామంలో రెండే వీధులు. ఒక దానిలో అగ్రవర్ణాలవారు, మరోదానిలో దళిత వర్గాలు జీవిస్తూ ఉంటారు.

శారదా ప్రియానందకు అనాధ శిశువులకు, తల్లీతండ్రి ఎవరో తెలియని అభాగ్యులకు, ఆలనాపాలనా లేని వృద్ధులకు ఒక ఆశ్రమాన్ని స్థాపించి నిర్వహించాలన్న ఆశయం వుండేది. అందుకు ఆమె ఈ గ్రామాన్ని ఎన్నుకున్నారు. ఈ విషయం తెలిసి స్వామి చిన్మయానంద "ఎందుకు నువ్వీ అనవసర లంపటంలో చిక్కుకుంటావు. అనాధ శిశువులను చేరదీయగానే సరిపోతుందా? వారిని పెంచి పెద్ద చేయాలి. వారికి పెళ్ళిళ్ళు చేయాలి. తర్వాత పురుళ్ళు వస్తాయి. ఎందుకీ అనవసర బాధ్యతలను తలకు ఎత్తుకుంటావని హెచ్చరించారు. అందుకు ఆమె దృఢంగా - వారు వారి ప్రారబ్దవశాన్న ఇక్కడకు వస్తారు. నేను వారికి పురుషార్థం మాత్రమే కలిగిస్తానని అన్నారు. ఆమె స్థిర సంకల్పం గ్రహించిన స్వామీజీ 'మంచిది. ఇకముందుకు సాగిపో' అని ఆశీర్వాదపూర్వక అనుజ్ఞను ఇచ్చారు.

స్వామీజీ ఆశ్రమ నిర్మాణానికి భూపూజ చేస్తూ నారాయణుడు నేలను యిచ్చాడు. ఆయనే నీటిని కూడా ఇస్తాడు అంటూ అక్కడవున్న ఒక మర్రి చెట్టు సమీపాన్ని చూపిస్తూ 'అక్కడ తవ్వండి. జల పడ్తుందని' అన్నారు. అదేవిధంగా జరిగింది.

నిరాడంబరంగా చిన్నస్థాయిలో ఆశ్రమం ప్రారంభ మయింది. వ్యవసాయదారుడైన ఒక భక్తుడు అక్కడ స్థిరపడి, అందుబాటులోవున్న జలవనరులతో ఒక ఎకరంలో సేద్యంచేసి జయప్రదంగా పంటలు పండించారు. ఇది మరింతమంది గ్రామస్తులు సేద్యం చేయడానికి పురి కొల్పింది. ఈలోగా దైవానుగ్రహం వలన ఆ గ్రామానికి కరెంటు వచ్చింది. చిన్మయానంద బొంబాయి నుండి నాలుగు నీటి పంపులను, ఇంజనీర్లను పంపాడు. దీనితో గ్రామస్తులు అధిక ఉత్సాహంతో వ్యవసాయం ప్రారంభిం చారు. ఆ గ్రామంలో 30 వాటర్ పంపుసెట్లు వున్నాయి. వందలాది ఎకరాలు సస్యశ్యామలమయ్యాయి. ఆ గ్రామం లోని భూమి దాదాపు యావత్తు భూమి సాగులోకి వచ్చింది.

స్వామి ప్రియానంద ఆ ఇరవై నాలుగు ఎకరాలలో ఆశ్రమాన్ని స్థాపించేనాటికి కేవలం 18 చెట్లు మాత్రమే వున్నాయి. ఇప్పుడు పదివేల నుండి ఇరవైవేల చెట్ల వరకు వుండి ఆ గ్రామం తపోవనంగా భాసిల్లుతోంది. ఆ గ్రామానికి తూర్పున ఉన్నకొండపై ఆమె దృష్టిపడింది. ప్రభుత్వం అందించే సహాయంతో గ్రామస్థులు పళ్ళ చెట్లను పెంచేందుకు ప్రోత్సహించింది. వాటిని పెంచడానికి నెలకు వందరూపాయలు ధనసహాయం చేసింది. ఆ పళ్ళ చెట్లమీద వచ్చే ఫలసాయాన్ని పెంచినవారే అనుభవించేటట్లు కట్టడి చేసింది. ఆవిధంగా ఆ కొండ యిప్పుడు అనేక ఫలవృక్షాలతో విరాజిల్లుతోంది. ఆ విధంగా ఒక కుగ్రామాన్ని ఒక ఆదర్శ గ్రామంగా అభివృద్ధి పథంలో ప్రవేశ పెట్టాలన్న ఆశయం నెరవేరింది. ఆ గ్రామవాసులకు మాత్రమేకాదు ఆ పరిసర గ్రామస్తులకు ఆమె ఆరాధ్య దైవమయింది. ఆమెలో వారు 'అమ్మ'ను చూశారు.

ఆసుపత్రిలో వదలివేయబడిన యిద్దరు పసిపిల్లలను ఆశ్రమానికి తీసుకుర్వావడంతో అనాధ శరణాలయ

కార్యక్రమం ప్రారంభమయింది. ఒక వృద్ధమహిళ యీ యిద్దరు పిల్లల ఆలనాపాలనా చూచేది. క్రమంగా ఆశ్రమంలో జేరుతూ వచ్చిన పిల్లల సంఖ్య పెరిగింది. శారదా ప్రియానంద పర్యవేక్షణ పోషణలో పెరిగారు. ఆశ్రమంలోనివారు పెరిగి పెద్దవారయ్యారు. అక్కడేవుండి చదువుకున్నారు. అక్కడే పెళ్ళిళ్ళు చేసుకుని జీవితంలో స్థిరపడి సుఖజీవనం చేస్తున్నారు. అలాగే ఏ ఆధారంలేని వయోవృద్ధులకు ఆమె మధ్యాహ్న భోజనం వసతి సదుపాయాలు కల్పించారు. ఇప్పుడు 135 మంది ఆ ఆశ్రమంలో వుంటున్నారు. ఆశ్రమ ఆవరణలో హరిహర పాఠశాలను స్థాపించి ఉచితంగా విద్యనేర్పుతున్నారు. ఒక హోమియోపతి క్లినిక్, మాగ్నెటిక్ థెరపీ క్లినిక్‌ను ఆ ఆశ్రమంలో నిర్వహిస్తున్నారు. ఆశ్రమంలోనే ఒక ధ్యాన మందిరాన్ని, ఒక నవగ్రహ మందిరాన్ని, హనుమాన్ దేవాలయాన్ని నిర్మించారు.

ఇదేవిధంగా ముంబాయికి చెందిన శ్రీ షాపే దంపతులు ఇచ్చిన విరాళంతో వడ్డేపల్లి గ్రామాన్ని దత్తత చేసుకుని అభివృద్ధి పరిచారు. బొంబాయిలోని చిన్మయానంద కేంద్ర కార్యాలయం ఇటువంటి ఆశ్రమాలకు శిక్షణా కేంద్రాలకు నిధులను సమకూరుస్తూ వుంటుంది. కాని శారదా ప్రియానంద ఎప్పుడు కేంద్ర కార్యాలయం నుంచి ఎట్టి నిధులను కోరలేదు. తన ఆశ్రమ నిర్వహణకు అవసరమైన ఖర్చును ఆమె తన భక్తుల ద్వారా సంపాదించు కునేవారు. అది నిరాడంబర జీవితం. ఆ ఆశ్రమంలోనే మట్టితో కట్టిన ఒక పూరిపాకలో నివసించేవారు. మండు వేసవిలోకూడా ఫాను వుండేదికాదు. ఎవరయినా ఫాను కొనిపెడ్తామంటే మాకు ఫానులు అనవసరం. మీరిచ్చే సొమ్ముతో ఆశ్రమానికి ఉపయోగపడే మరేవనైనా చేయవచ్చు అనేవారు.

స్వామి చిన్మయానంద దివంగతులయిన తర్వాత ఆయన శిష్యులలో ప్రథమగణ్యురాలు శారదా ప్రియానంద. స్వామివారి సందేశాన్ని వినిపించడానికి హైందవ వేదాంత సారాన్ని ముఖ్యంగా ఉపనిషత్తులసారాన్ని వివరించడానికి దేశమంతటేకాక అమెరికావంటి దేశాలలో విస్తృతపర్యటన జరిపారు. ఆమెకు ప్రపంచవ్యాప్తంగా అనేకమంది భక్తులూ, శిష్యులూ ఏర్పడ్డారు. వారందరికీ శారదా ప్రియానంద అమ్మ. కొన్నివేలమందికి ఆమె అమ్మ.

ఇంగ్లీషు, తెలుగు భాషలమీద ఆమెకు మంచి అధికారం వుంది. కవితా హృదయం వుంది. రెండు భాషల్లోనూ ధారాళంగా మాట్లాడగలగడమేకాక చక్కగా వ్రాయ గలదు. అందువల్లనే చిన్మయానంద గ్రంధాలన్నింటినీ ఆమె తెలుగులోనే అనువదించారు. ముఖ్యంగా ఉపనిషత్తులను తెనిగించారు.

చిన్మయానంద మిషన్ కేంద్రం విజయవాడ సమీప రాయవరప్పాడు నుంచి నడుపుతున్న, అరణ్య స్పందన, మాసపత్రికలో స్వామి శారదా ప్రియానంద అనేక రచనలు చేసేవారు. అందులో ఆమె పాఠకులు అడిగే ఆధ్యాత్మిక సందేశాలకు సంతృప్తికరమైన జవాబులిచ్చేవారు. ఆ పత్రికకు ఆమె యిచ్చే జవాబులు ప్రధానాకర్షణగా ఉండేవి.

గత సంవత్సరం డిసెంబరులో శారదా ప్రియానంద ఆరోగ్యం దెబ్బతింది. రక్తసంబంధమైన వ్యాధితో ఆమె బాధపడ్తున్నారని అది కుదరని వ్యాధి అని డాక్టరు తేల్చి చెప్పారు. రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి వంటి అవతార పురుషులు అతి బాధాకరమైన కాన్సర్ వ్యాధితో మరణించారు. ఆ విధంగా వారి శేషకర్మక్షయమయింది. అదేవిధంగా శారదా ప్రియానంద కూడా అతి బాధాకరమైన వ్యాధితో బాధపడ్డారు. ఎప్పటికప్పుడు శరీరంలోని కలుషిత రక్తాన్ని తొలగించి పరిశుద్ధ రక్తాన్ని ఎక్కించవలసి వచ్చేది. ఆ విధంగా ఆమె కర్మకూడా పూర్తిగా క్షయమయింది.

చివరకు ఈ సంవత్సరం ఏప్రిల్ 17వ తేదీన తిరుపతి లోని ఒక వైద్యశాలలో ఆమె నిర్యాణం చెందారు. రమణ మహర్షి మరణించినప్పుడు ఆయన గదిలోంచి ఒక ఉజ్వల ప్రకాశం ఉత్తరం వైపు ఆకాశంలోకి దూసుకుపోయిందని చెప్తారు. అదేవిధంగా శారదా ప్రియానంద మరణిస్తున్న సమయంలో ఆమె పరుండి వున్నగదంతా ఒక్కసారి ప్రకాశవంతమయిందని ఆ సమయంలో అక్కడవున్నవారు చెప్పారు. తీవ్రమైన అనారోగ్యంలో వుండికూడా ఆమె ఉగాది సందేశం యిచ్చారు. అదే ఆమె మలి సందేశం.

ఇందులో (ఉగాది పచ్చడిలో) ఉండేటటువంటి ఆరు రుచులను సమానంగా స్వీకరించి ప్రతిరోజు ఒక సంవత్సరాదిగా భావించుకొంటూ అన్నిరకాల అనుభవాలను సమానంగా స్వీకరించి నిత్యమయిన ఉగాదిలో సంతోషంగా జీవించారు. ○

ఎందరో మహితాత్ములు - అందరికీ పాదాభివందనాలు.

# అమృతవాణి

శ్లో॥ యమావలోకోదిత భీతికంప
మర్మవ్యథోచ్ఛ్వాస గతీశ్చ వేదనాం
ప్రాణప్రయాణే పరిదృశ్యమానాం
విచార్యకోవా విరతిం నయాతి?

సామాన్యంగా యమధర్మరాజు పేరు చెప్పగానే భయం కలుగుతుంది. అయితే పుణ్యాత్ములు భయపడక్కర్లేదు. అయినా ఆ పేరు వింటేచాలు ఒక విధమైన కంపరం పుడుతుంది. ప్రాణాలు పోయే సమయంలో యమదర్శనమవుతుందంటారు. నిజంగా చావుసిద్ధంగావున్నవాడికి ఆయన దర్శనం కలగగానే విపరీతమైన భయంకలగక యేమౌతుంది? ఆయన్ని చూస్తేనే వణికిపోతారు.

యముడు పాశంవేసి జీవుణ్ణి లాక్కుపోతాడుకదా! అయితే లాక్కుపోతున్నట్లు బయట చూచేవాళ్ళకు కనబడదు. ఎందుకనంటే యముడు జీవుని సూక్ష్మశరీరాన్ని పాశంతో బంధించి తీసుకెళతాడు. స్థూలశరీరం తగలబడుతూంటుంది. ఈ సూక్ష్మశరీరంలో ప్రాణమయాదికోశాలు, మనస్సు, సూక్ష్మేంద్రియాలు వుంటాయి. జీవుని వాసనలన్నీ వుంటాయి. కనుక జీవుడు ఆ శరీరంతో బాధలను అనుభవిస్తూంటాడు. స్థూలశరీరాన్ని ఆశ్రయించివున్న సూక్ష్మ శరీరాన్ని యముడు పాశంతో లాగుతూంటే అవయవ సంధుల్లో కలిగే బాధ యింతా అంతాకాదు. పంచప్రాణాలు, ఉపప్రాణాలు ఆయాస్థానాల్లో ఉనికిని బట్టి వేరువేరుగా కనబడినా ప్రాణవాయువనేది ఒక్కటే. యమపాశం లాగుతున్నప్పుడు ఆయా ప్రదేశాల్లోవున్న ప్రాణాలన్నీ సంకోచంచెంది ఒకటై కంఠం దగ్గరకు చేరతాయి. అప్పుడు ఊర్ధ్వశ్వాస మిక్కుటంగా కలుగుతుంది. దాన్నే ఎగశ్వాస పుట్టిందంటారు. అప్పుడు జీవుడనుభవించే బాధ వర్ణనాతీతం. జీవుడా బాధ తట్టుకోలేక తన్నుకులాడుతూంటే భగవన్నామం ఏం చేయగలడు చెప్పండి? ఆ బాధ అనుభవించటంతోనే సరిపోతుంది. ఒక పట్టాన ప్రాణాలు పోవు. చెట్టును మొదలంటా వేళ్ళతో సహా పీకటం ఎలాంటిదో యమపాశం ప్రాణాలను పైకి లాగటం కూడా అలాంటిదే! అప్పటిదాకా భౌతిక సుఖాలెన్నో అనుభవించి అవన్నీ శాశ్వతమని భావించిన జీవుడిప్పుడు పడే బాధ ఏం చెప్పగలం? ఇంద్రియాలు విషయసుఖాలనుభవించిన అనుభవం ఇప్పుడేమైనది? అప్పుడు ప్రాణోత్క్రమణబాధకు తట్టుకోలేక తల్లడిల్లిపోతూ గత జీవితమంతా తుచ్ఛమనీ అసలు సత్యాన్ని తెల్సుకోలేకపోయావనీ విచారం బయలుదేరుతుంది. ఇలాంటి దుర్భర దుఃఖానుభవంలో కూడ జీవునికి విరక్తి పుట్టక ఏమౌతుంది?

- కూచిభట్ల చంద్రశేఖర శర్మ

రసవద్ఘట్టాలు - 51

## ఆలివర్ గోల్డ్‌స్మిత్ ఔదార్యం

ఆలివర్ గోల్డ్‌స్మిత్ ఆంగ్ల సాహిత్యవేత్తలలో అగ్రశ్రేణికి చెందిన నవలారచయిత, నాటకకర్త. ఆర్ద్రహృదయుడాయన. తన సుఖాన్ని విస్మరించి, ఆర్తులనాదుకొన్న కరుణామయుడు. వైద్యశాస్త్రం చదివి పట్టాపుచ్చుకొన్నాడు కాని వృత్తిని చేపట్టలేదు.

ఒకరోజు బీదరాలైన ఒక స్త్రీ గోల్డ్‌స్మిత్‌ను కలుసుకొన్నది. "సర్, నా భర్త జబ్బుతో బాధపడుతున్నాడు. నా వద్ద చిల్లిగవ్వ లేదు. తాము దయచేసి ఒకసారి, మా ఇంటికి వచ్చి చూడాలి' అని బతిమాలుకొంది. గోల్డ్‌స్మిత్ ఆమె ఇంటికి వెళ్ళాడు. రోగి చాలా బలహీనంగా వున్నాడు. చలి నుండి తప్పించుకొనే సౌకర్యాలు లేవు. ఇంట్లో నాలుగైదు రోజులుగా వండిన సూచనలే కానరాలేదు.

"అమ్మా! నేను ఇంటికి వెళ్తున్నాను. నా నౌకరుతో పది మాత్రలున్న పొట్లం పంపిస్తాను. అవి అతనికి ఇవ్వండి. త్వరలోనే కోలుకొంటాడు. గోల్డ్‌స్మిత్ ఇంటికి వెళ్ళి పది గిని (నాణేలు)లను ఒక పొట్లంలో వుంచి, దానితోపాటు ఒక చీటి పంపాడు. ఒక నాణెంతో, వంట చెరుకు, పాలు, బ్రెడ్ కొనివ్వండి. మిగతా పైకం అవసరమైనప్పుడు వాడుకోండి. ఓపికతో వుండండి. బాగవుతుంది' అన్నాడు. 'మందు కంటే ముందు నాకు కావలసినదదే' అని నిశ్చయించుకొన్నాడు రోగి.

రెండువారాలకు రోగి బాగా కోలుకున్నాడు. గోల్డ్‌స్మిత్ ఇంటికి వెళ్ళి కృతజ్ఞతలు చెల్లించుకొన్నాడు. ఆలివర్ గోల్డ్‌స్మిత్ 1728 నవంబర్ 10న జన్మించి, 1774 ఏప్రిల్ 14న కన్నుమూశాడు.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# మనిషి కార్చే దొంగ కన్నీరు

ఎవరైనా లోపల కపటం పెట్టుకొని పైకి ప్రేమ నటిస్తూ కష్టాలలోవున్న వ్యక్తిని గురించి కన్నీరు కారిస్తే వాడివన్నీ మొసలి కన్నీళ్ళు అంటుంటారు. ఆ వ్యక్తి నైజం గురించి తెలిసినవాళ్ళు. ఈ 'మొసలి కన్నీళ్ళు' అన్ననానుడి ఎందుకు వచ్చింది? మొసలి ఏదైనా జంతువును ఫలహారం చేస్తున్నప్పుడు దవడలను బలంగా ఆడిస్తుంది. ఆ ఒత్తిడి తాకిడికి కను గ్రుడ్ల ప్రక్కనుండే గ్రంథులకి తాకి అవి నీటిని స్రవిస్తాయి. అది చూస్తే, 'అయ్యో! ఈ జంతువులను నేను చంపి తినవలసివచ్చింది కదా'అని బాధపడ్తూ తప్పనిసరిగా తింటూ, కన్నీరు కారుస్తున్నట్లు అనిపిస్తుంది. అందుకే ఈ సామెత వచ్చింది. మొసలి సంగతేమోకాని మనిషికూడా దొంగకన్నీరు కార్చడంలో తక్కువవాడేమీకాడు. ఉల్లిపాయలను కరకరా తరుగుతూ ఇబ్బడి ముబ్బడిగా కన్నీరు కార్చేస్తుంటాడు. అప్పుడు ఉల్లిపాయ కూడా అనుకుంటుందేమో! 'నన్ను ఖండఖండాలుచేస్తూ, వీళ్ళు కన్నీళ్ళు కారుస్తారు ఎంత నటన! అని దానికి నోరుంటే. 'మనిషి కన్నీరు' అని ఓ సామెత సృష్టించి ఉండేదికూడా!

ఇంతకీ ఉల్లిపాయలు తరిగేటప్పుడు మనిషికి కన్నీరు ఎందుకు వస్తాయి? కనులలో గ్రుడ్డుకు ప్రక్కన గ్రంధులు ఉంటాయి. ఇవే నీటిని స్రవిస్తాయి. ఇదే కన్నీరు. నిజానికి ఈ కన్నీరు ప్రకృతి మనిషికి ప్రసాదించిన పరమవరం. 'నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి' అని కవి అన్నట్లు మనిషి మహానందానికికాని, విపరీతమైన కోపానికికాని గురి అయినప్పుడు మానసికంగా చాలా ఒత్తిడికి లోనవుతాడు. ఆ ఒత్తిడి కన్నీటి గ్రంధులను తాకి భాష్పాలు వస్తాయి. ఆ విధంగా ఆ ఒత్తిడి బయటకు పోతుంది. మనసు తేలిక పడ్తుంది. అది అలా బయటకు పోకపోతే ఆ ఒత్తిడి గుండెకు తాకి గుండెజబ్బు వచ్చే ప్రమాదం ఉంది. కన్నీళ్ళు ఎమర్జెన్సీ డాక్టరులాగా పనిచేస్తాయి.

ఇంక ఉల్లిసంగతి చూసుకుందాం. ఉల్లిలో అనేక జీవ రసాయనాలు ఉంటాయి. వీటిలో ముఖ్యమైనవి థియోసల్ఫేట్స్, థియోసల్ఫోనేట్స్. ఇవి చాలా సున్నితమైనవి. ఉల్లిని కోయగానే ఈ రసాయనాలు అతి త్వరగా గాలిలో విస్తరిస్తాయి. ఈ రసాయనాలు కళ్ళకు తగలగానే కళ్ళు మండేటట్లు చేస్తాయి. శరీరం ఇతరపదార్థాలను (ఫారిన్ బాడీస్) తనలో ఉండనీయదు. అందువల్ల ఈ రసాయనాలను వెళ్ళగొట్టడానికి గ్రంథులు కన్నీటిని స్రవిస్తాయి. ఆ నీటిలో ఈ రసాయనాలు కొట్టుకు పోతాయి. అలాగే దుమ్మూ, ధూళీ పడ్డప్పుడు కూడా వెంటనే కన్నీళ్ళు స్రవించి కళ్ళను శుభ్రపరుస్తుంది. మనకు తెలియ కుండానే మన శరీరంలో పనిచేసే కళ్ళ డాక్టరు ఈ గ్రంథులు.

కె.ఆర్.కె. మోహన్

విజ్ఞానవాణి - 8

## మన అరచేతిలో రేఖలు ఎందుకుంటాయి?

వస్తువులను పట్టుకునే ముఖ్యమైన పని అరచేతికి ఉంది. ఈ పట్టుకోవడం దృఢంగా ఉండేందుకు అరచేతిలో చర్మం మిగిలిన శరీర భాగంలోని చర్మంతో పోలిస్తే స్థిరమైనదిగా ఉండాలి. అరచేతిలో రేఖలు, అంటే చర్మాన్ని కలిపే జాయింట్సు అనవచ్చు. ఇక్కడ చర్మం క్రిందకి దిగిఉండి అరచేతికి గట్టి పట్టుకల్గించేందుకు సహాయ పడుతుంది.

అరచేతికి చర్మంలో ఇటువంటి జాయింట్సు ఉండడం వల్లనే అరచేతికి చర్మం వస్తువులను కదలకుండా పట్టి ఉంచగలుగుతుంది. వ్యక్తి వ్యక్తికీ ఈ రేఖలు విచిత్రంగా ఉంటాయి. కాబట్టి ఈ రేఖలను బట్టి మనిషి అదృష్టం ఉంటుందనే నమ్మిక కొంతమందికి ఉంటుంది.

అరచేతిలో మొటిమల మాదిరి బొటిమల వరుసలు ఉంటాయి. ఇవి ప్రధానంగా వేలి చివరల స్పష్టంగ కన్పిస్తాయి. నేరపరిశోధనలో ఉపయోగపడే వేలిముద్రలు వీటి కారణంగానే వస్తాయి. వీటిని ఘర్షణ శిఖరాలు అనవచ్చు. ఎందుకంటే వస్తువు జారకుండా అరచేతిలో ఘర్షణతో వస్తువును పట్టి ఉంచడంలో ఇవి తోడ్పడతాయి. ఈ ఘర్షణ శిఖరాల కారణంగానే నేలమీద పడి ఉండే చిన్న వస్తువులను సయితం పట్టుకొని పైకి తీయగల్గుతాం.

# దృఢచిత్తులు

తండ్రికిచ్చిన మాట తప్పని తనయుడని లోక ప్రసిద్ధినొందిన శ్రీరామచంద్రుడు రామాయణంలో దృఢ చిత్తుడైతే - పదుగురెదుట తండ్రికోసం భీకర ప్రతిజ్ఞ చేసి, జీవించినంతకాలం ఆ ప్రతినను నిలబెట్టుకొనిన మహా మనీషి భీష్ముడు - భారతంలోని దృఢచిత్తుడు. ఈ విధంగా తండ్రికోసం తండ్రి సంతోషం కోసం, తమ జీవిత సుఖాల్ని త్యాగంచేసిన త్యాగమూర్తులెందరో ఉన్నారు. జీవితమన్నది తమ సుఖసంతోషాలకేకాదని, ఇతరుల కోసం తమ జీవితాన్ని అర్పించడంలోనే ఆనందముంటుందని నమ్మిన వ్యక్తులు వారు! పుచ్చుకోవడంకన్న, ఇచ్చుకోవడంలోనే తృప్తి ఆనందం ఉంటాయనేదే వారి ఆదర్శం!

కౌరవ సామ్రాజ్యాధీశుడు శంతనుడు ఒకనాడు యమునా నదీతీరం వెంబడి వేటాడుతూ అలసి సొలసి పోతాడు. అదే సమయంలో, ఆ నదిలోనే నావ నడుపుచున్న ఓ అపురూప సౌందర్యరాశి అతని కంటబడుతుంది. దగ్గరకు చేరి వివరములడుగగా, తాను దాశరాజు పుత్రికనని, సత్యవతీ నామధేయురాలననీ ఆమె ఎఱుకపర్చింది. ఆమె ముగ్ధ మనోహర సౌందర్యమునకు ముగ్ధుడైన శంతనుడు దాశరాజుతో సంప్రదించి, ఆమెను పరిణయమాడవలెనని మనసులోనే నిర్ణయించుకొన్నాడు. తదనుగుణంగా కొన్ని దినములు పిమ్మట, దాశరాజును సందర్శించాడు. అతిథి మర్యాదలు గావించిన దాశరాజు, ఆతని మనోరథమును గ్రహించాడు.

"మహారాజా! తమవంటి ధరణీశ్వరులు మాకు జామాత కాగోరుటకంటే మాకింక మహద్భాగ్యమేముంది? అయిననూ - నామనసులోని మాటను మీకు మనవి చేస్తాను. నా పుత్రికను పరిణయమాడదలచినచో - నాకొక వాగ్దానమీయ వలసియున్నది" అని పల్కాడు దాశరాజు.

'సముచిత వాగ్దానమైతే తప్పక అంగీకరిస్తాను! ముందుగా విషయమును విన్న పిదపే నిర్ణయం గైకొంటాను' అన్నాడు శంతనుడు! 'మహారాజా! మీ వల్ల నా పుత్రికకు జన్మించిన పుత్రుడే కౌరవ సామ్రాజ్యానికి అధిపతి కావలసి యున్నది. ఇది నా అభిమతము' అంటూ మనోవాంఛను వెల్లడించాడు. క్షణకాలం నివ్వెరపోయిన శంతనుడు అంతలోనే తెప్పరిల్లి, అందులకెంత మాత్రము అంగీకరింప జాలనని బదులు చెప్పి తిరుగు ప్రయాణము సాగించాడు. అంత: పురముచేరి, తన నిర్ణయమును అందరికీ తెలియపర్చగా, అందరూ హర్షామోదాలు తెలియచేశారు. కాని శంతనుని మనసు మాత్రం ఆ దాశరాజు పుత్రిక వైపునకే పరుగులు తీయసాగింది. తన్మూలంగా చింతాక్రాంతుడై క్రమక్రమంగా కృశించసాగాడు! ఈ విషయమంతయు తెలిసికొన్న దేవవ్రతుడు తండ్రిని చేరి వారి మనోవేదనకుగల కారణమును తెలియచెప్పవలసినదిగా వేడుకొన్నాడు.

## సోమంచి రామం

"నాయనా! ఒకే పుత్రుడున్నా, లేనట్లేనని ధర్మ శాస్త్రములు ఘోషిస్తున్నాయి. తలవని తలంపుగా నీకేదేని ఆపద సంభవించినచో, ఈ భరతవంశం విచ్ఛిన్నమై పోవునుగదాయని కుమిలిపోతున్నాను" అంటూ పల్కిన తండ్రి మాటలలోని అంతరార్థాన్ని గ్రహించాడు భీష్ముడు! అనంతరం మంత్రి సామంతులతో సంప్రదించి, చర్చించి, దాశరాజుకడకు ప్రయాణమైనాడు.

అతిథి మర్యాదలతో సత్కరించిన దాశరాజు, "గంగాసుతా! నీ వంటి సత్పుత్రుడున్నంత వరకు శంతన మహారాజుకు ఏ లోటూరాదు. పితృపాదుల కోర్కెతీర్చుటకై మా సత్యవతి నర్థించవచ్చినావు. నీవలన, మా సత్యవతి కింతకుపూర్వమే సపత్నీపుత్ర దోషం ఏర్పడును కదా! అలాంటి సమయంలో, సత్యవతీ పుత్రుడే కౌరవ సామ్రాజ్యాధిపతి అగుటకు అవరోధము కదా!" అంటూ సందేహం వెలిబుచ్చాడు.

అంతట భీష్ముడు క్షణకాలం మౌనంవహించి "దాశరాజా మంత్రులారా! ప్రజలారా! అందరూ వినండి! మా తండ్రి గారి అభీష్టము తీర్చుటకై, నేను కఠోర దీక్ష వహిస్తున్నాను. ఇకపై సత్యవతీ పుత్రుడై కౌరవ సామ్రాజ్య పరిపాలనార్హత కల్గిఉంటాడు. ఆతడే మనకందరకు ప్రభువు" అంటాడు భీష్ముడు గంభీర స్వరంతో!

"దేవవ్రతా! ముమ్ముందు నీకుద్భవించే పుత్రులు నీ ప్రతిజ్ఞను పాటించరేమో!" అన్నాడు దాశరాజు! అంతట శంతన తనయుడు, "మహాప్రజలారా! నేనిదే భీషణ ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఈ క్షణం నుంచే ఆజన్మాంత బ్రహ్మచర్య వ్రతం ఆచరిస్తున్నాను" అన్నాడు. అలా భీషణ ప్రతిజ్ఞ చేసి, ఆజన్మాంతము ఆడినమాట నిలబెట్టుకొన్న భీష్ముడు దృఢచిత్తుడు. 



మహిళాదినోత్సవ సందేశం

# తల్లులు సత్యసంకల్పాలను అలవర్చుకోవాలి

"రమణీ శిరోమణుల్ రావచ్చు పోవచ్చు
శాశ్వతమైనది సత్యమొకటే
రాజ్యభోగములెన్నో రావచ్చు పోవచ్చు
శాశ్వతమైనది సత్యమొకటే
భ్రాతలు బంధువుల్ రావచ్చు పోవచ్చు
శాశ్వతమైనది సత్యమొకటే
లోకమందు అధికార భోగముల్ రావచ్చు పోవచ్చు
శాశ్వతమైనది సత్యమొకటే
సరససన్మార్గ పత్రంబు తెలియజెప్పి
అమృతము అదియె సకల సౌభాగ్యమందు
భువిని సత్యంబెమరమ సౌభాగ్యమందు"

ప్రేమస్వరూపులారా!

ఈనాడు పందొమ్మిదవతేది. స్త్రీల గుణగణములను ప్రకటించి, ప్రచారంచేసి, ఆనందించడానికి ఈ శుభ దినమును ప్రారంభించాము. స్త్రీలలో సత్య సంస్కృతు లున్నాయి. భూమి ఒకటేకాని, దానిలో ఎట్టి విత్తనమునాటితే అట్టి మొక్కలే అభివృద్ధి అవుతాయి. తల్లి గర్భము భూదేవితో సమానం. ఇందులో ఎట్టి సంకల్పములనే విత్తనములు నాటుదుమో, అట్టి ఫలములనే అందుకో గలుగుతాం. వేపవిత్తనములునాటి, మధురమైన మామిడి ఫలములను పొందలేము. కనుక తల్లి గర్భమును నిరంతరమూ సత్యసంకల్పములచేత, సత్యభావములచేత నింపుకోవాలి. అప్పుడే సద్గుణవంతులైన బిడ్డలు కలుగు తారు. దుర్గుణములు, దురాలోచనలుగల బిడ్డలు అభివృద్ధి కావడానికిగాని, సద్గుణసంపన్నులైన బిడ్డలు కలగడానికిగాని మూలకారణం ఆ తల్లి యొక్క సంకల్పములే.

పూర్వము 'ఆర్యాంబ' అనే గొప్ప గుణవంతురాలు కేరళ లోని 'కాలడీ'లో ఉండేది. ఆమె నిరంతరం దైవచింతనతో, దైవకార్యములనే చేస్తుండేది. తత్ఫలితంగా ఆమె గర్భమున జగద్గురువు శంకరాచార్యులవారు జన్మించారు. శంకరుడు, జగద్గురువుగా ఎదగడానికి కారణం ఆ తల్లి యొక్క సంకల్పముల ఫలితమే. వివేకానంద, రామకృష్ణ పరమ హంస మొదలగు వారెందరో, వారి వారి తల్లుల సంకల్పముల చేతనే ఇంత గొప్పవారుగా తయారైనారు. తల్లుల శిక్షణ మీదనే పిల్లల ప్రవర్తన ఆధారపడి ఉంటుంది. కనుక పిల్లలు తప్పులు చేసినప్పుడు, వారిని మందలించి సరియైన మార్గంలో పెట్టటానికి ప్రయత్నించాలి తల్లులు. పిల్లలు తప్పుచేస్తే తగిన శిక్ష యివ్వాలి. మంచి చేస్తే మెచ్చుకోవాలి

## భగవాన్ సాయి దివ్య సందేశం

తల్లులు. తప్పుకు తగిన శిక్ష, మంచికి తగిన ఫలితము తల్లి యొక్క చేతియందే ఉంటున్నది. కనుక ప్రతి మానవుడు తల్లి సంకల్పము ప్రకారమే మారుతుంటాడు.

ఈనాడు చదువులన్నియు కేవలం పొట్టకూటికోసం చదివే చదువులే. కుటుంబము, సమాజము, దేశము యొక్క క్షేమాన్ని ఏమాత్రం హృదయంలో సంకల్పించటం లేదు. ప్రతి ఒక్కరూ మొట్టమొదట కుటుంబ క్షేమాన్ని తమ దృష్టియందుంచుకోవాలి. సమాజ సంక్షేమాన్ని గురించి శ్రద్ధ తీసుకోవాలి. దేశం యొక్క పురోభివృద్ధిని గురించి ఆలోచించాలి. కాని ఈనాడు ఎవరూ వీటిని గురించి ఏమాత్రం పట్టించుకోవటంలేదు. అయితే ఆనాడు తల్లులు సదాచార సంపన్నులై వుండటంచేతనే, పిల్లలు కూడా సద్గుణవంతులై, సదాచార సంపన్నులై, సన్మార్గంలో నడుస్తూ వచ్చారు

ఒకసారి ఈశ్వరచంద్రవిద్యాసాగర్ తన తల్లితో వెన్నెలలో కూర్చొని సంభాషిస్తున్నాడు. "అమ్మా! నీ అభీష్టం తెలిపితే, నేను దానిని తప్పక నెరవేరుస్తాను" అన్నాడు. అప్పుడు ఆయన తల్లి "నాయనా! నాకొక కోరిక ఉన్నది. మన పల్లె ప్రజలంతా త్రాగడానికి నీరు లేక, చాలా దూరం వెళ్లి మంచినీరును తెచ్చుకుంటున్నారు. వారు పడే అవస్తను చూడలేక ఉన్నాను. కనుక మన పల్లెలో ఒక బావిని త్రవ్వించుతే నేను చాలా సంతోషిస్తాను" అన్నది. విద్యాసాగర్ తన తల్లి కోరికను తీర్చాడు. అప్పుడు ఆ తల్లి

సంతోషించింది. మరొక దినం పాత చీరె కుట్టుకుంటూ ఇంటి దగ్గర కూర్చొని ఉన్నది ఆయన తల్లి. "అమ్మా! నీకు యింకా ఏమైనా కోరిక వుంటే చెప్పమ్మా!" అని అడిగాడు విద్యాసాగర్. అప్పుడు "నాయనా! నాకు ఇంకా ఒక కోరిక ఉన్నది. మన పల్లెలో చదువుకోవటానికి పాఠశాల లేక, చాలా దూరం వెళ్ళి చదువుకొని వస్తున్నారు. ఆ దృశ్యాన్ని నేను చూడలేక పోతున్నాను. కనుక మన గ్రామంలోనే ఒక చిన్న బడిని నిర్మించుతే బాగుంటుంది" అన్నది. కొలది కాలంలోనే ఆ పల్లెలో ఒక చిన్నబడిని నిర్మించాడు. ఆ తల్లి సంతోషించింది. మరల కొంత కాలానికి ఒక చిన్న కోరికకోరింది. "నాయనా! మంచినీరును అందించావు. చదువుకోవటానికి ఒక చిన్నబడిని కూడా ఏర్పాటు చేసావు. కాని యింకా ఒక చిన్న కోరిక ఉన్నది నాయనా! వైద్య సౌకర్యం లేక మన పల్లెవాసులు చాలా కష్టపడుతున్నారు. కనుక ఒక చిన్న వైద్యశాల కూడా ఏర్పాటు చేస్తే బాగుంటుంది" అన్నది. ఆ కోరిక కూడా తీర్చాడు విద్యాసాగర్. ఒక వైద్యశాలను కూడా ఆ కుగ్రామంలో ఏర్పాటు చేసాడు. తల్లి మరింత ఆనందపడింది. తల్లి సంకల్పాలు ఉత్తమమైనవిగా ఉంటుంటాయి. ఆ సంకల్పాలను నెరవేర్చే నిమిత్తమే మనం ఆమె గర్భములో పుట్టామనే సంకల్పాన్ని మనం దృఢం చేసుకోవాలి. తల్లి గర్భమున పుట్టిన మనం ఆ తల్లికే దుఃఖమును కలిగించకూడదు.

ఇదేవిధమైనది ఈ దేహమునకు కూడా జరిగింది. నేను ఒకసారి పైన భోజనం చేస్తున్నాను. ఈ దేహమునకు తల్లి అయిన గృహం అమ్మ పైకి వచ్చింది. "ఎందుకమ్మా! పైకి వచ్చావు" అన్నాను. భోజనం చేయి! భోజనం చేయి! తరువాత చెబుతానన్నది. భోజనం అయిన తరువాత "స్వామీ! మన పల్లె చాలా కుగ్రామం. ఇక్కడ వైద్యంలేక చాలా బాధపడుతున్నారు. తల్లులు చంటిబిడ్డలను ఎత్తుకొని, బుక్కపట్నం పరుగెడుతున్నారు" అన్నది. అప్పుడు నేను చెప్పాను. ఈ గ్రామంలోనే ఒక హాస్పిటల్ కట్టిస్తానని చెప్పాను. అప్పుడు ఒక చిన్నది కట్టించాను. మరల తరువాత ఒకసారి నా దగ్గరకు వచ్చి "స్వామీ! మీరు ఏమీ అనుకోవద్దు. నాకొక రెండవ కోరిక ఉన్నది. మీరు తీర్చాలి" అన్నది. "నీకూ కోరికలుంటున్నాయా!" అన్నాను. "ఇన్నివేలమంది కోరికలు తీరుస్తున్నావు గదా! నా కోరిక మాత్రం ఎందుకు తీర్చ గూడదు" అన్నది. నీ కోరిక ఏమిటన్నాను. అప్పుడు చెప్పింది. "మన గ్రామంలో త్రాగేనీరులేక చాలామంది బాధపడు తున్నారు. ఒక బావిని త్రవ్వించండి" అన్నది. వెంటనే మన మందిరంలోనే త్రవ్వించాను. గ్రామ ప్రజలందరూ యిక్కడకు వచ్చి నీరును తీసుకొని వెళ్ళేవారు. మరొకసారి వచ్చింది. "స్వామీ! నేను చాలా ఆనందంగా ఉంటున్నాను. కానీ మరొక్క చిన్న కోరిక ఉన్నది" అన్నది. ఏమిటి ? చెప్పమన్నాను అప్పుడు "మన గ్రామంలో చదువుకోవడానికి బడిలేక బుక్కపట్నం వెళ్ళుతున్నారు. నడవలేక నడవలేక చాలా బాధపడుతూవెళ్ళుతున్నారు, వస్తున్నారు. కనుక మన గ్రామంలోనే ఒక చిన్న బడిని కట్టించండి" అన్నది. కట్టించాను. అప్పుడు చాలా సంతోషించింది. ఇక నాకు చాలు స్వామీ! అన్నది.

ఆనాడు ఒక చిన్న స్కూలునే కట్టించాను. ఈనాడు పెద్ద యూనివర్శిటీ అయింది. ఆనాడు చిన్న హాస్పిటల్‌నే కట్టించాను. ఈనాడు సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌గా మారి పోయింది. ఆనాడు ఏదో చిన్న బావిని త్రవ్వించి నీటిని అందించాను. అయితే ఈనాడు మన జిల్లావాసులందరికి పైపులద్వారా నీరును అందిస్తున్నాను. కనుక తల్లి **సంకల్పములు ఉత్తమమైనవిగా వున్నప్పుడు పిల్లల సంకల్పములు కూడా ఉత్తమమైనవిగా ఉంటుంటాయి.** దానికి తగిన శక్తి సామర్థ్యములుకూడా చేకూర్చుకుంటాయి. సత్సంకల్పములు మానవునియందు కలిగినప్పుడు, అవి తప్పక అభివృద్ధిలోనికి వస్తాయి. మంచి చేయాలని సంకల్పించుకుంటే, అది జరిగిపోతుంది. నీ సంకల్ప బలమే నీకు శక్తినందిస్తుంది.

"కామక్రోధౌ వశేకృత్వా
దంభం లోభమనార్జవమ్
ధర్మమిత్యేవ సంతుష్టాః
శిష్టాః శిష్ట సమ్మతాః"

ఎవరు కామక్రోధాలను, దంభం, లోభం, కుటిలత్వం - వీటిని జయించి ధర్మమార్గాన్నే స్వీయమార్గంగా తలచి సంతోషాన్ని పొందుతారో, వారే ఉత్తములు. వాళ్ళనే ఉత్తములు కూడా ఆదరిస్తారు.

భగవంతుని ప్రేమను మాత్రమే అందుకుంటే, సర్వమూ అందులోనే చేరిపోతుంటుంది. "**ప్రేమ రూపము బ్రహ్మంబు, ప్రేమమయము**". అంతా భగవంతుని యొక్క ప్రేమనే. ఈ జగత్తంతా కూడనూ ప్రేమనే. కనుక ఆ ఒక్క ప్రేమ గనుక మనయందుంటే సర్వమూ సిద్ధిస్తుంది. చిల్లర కోరికలు కోరుకొని మన జీవితాన్ని వ్యర్థం చేయవద్దు. అందరియందునూ వుండినది ఒకే ప్రేమనే. ఆ ప్రేమచేతనే ఈ జగత్తులో అందరూ జీవించగలుగుతున్నారు. ప్రతి మానవుడూ, ఈ విశ్వకుటుంబంలో ఒకవ్యక్తిగా మనగలుగుతున్నాడు. ఆనాడు చైతన్యుడు వీధివీధినా తిరిగి దీనినే బోధించాడు. చిరుతలుపట్టి కృష్ణభజన చేస్తూ పోతుంటే, దుర్మార్గులు వచ్చి ఆ చిరుతలను కూడా తీసుకొని పోయేవారు. ఎక్కడమంచో, అక్కడ చెడ్డకూడా ఉంటుంటుంది. ఎక్కడ పవిత్రమో అక్కడ అపవిత్రము కూడా చేరుతూ వుంటుంది. ఎక్కడ వెలుగో, అక్కడ నీడ కూడా ఉంటునే ఉంటుంటుంది. మంచివారికి అన్నీ కష్టాలే కలుగుతుంటుంటాయి. అయితే ఆ కష్టాలు మన మంచిని అభివృద్ధి పరుస్తాయి. అయితే ఆ దృఢ సంకల్పం ఉండాలి. అట్టి దృఢ సంకల్పంతోనే చైతన్యుడు చిరతలు లేకపోయినా భజన చేస్తూ ముందుకు సాగిపోయాడు. ఆ విధంగా పోతుంటే పిల్లలు కూడా అనేకమంది చేరి తాళాలు, చిరుతలు తీసుకొని భజనచేస్తూ చైతన్యుని వెంట నడిచేవారు. అయితే ఆ పిల్లలను వారి తల్లిదండ్రులు మందలించేవారు. కాని ఆ పిల్లలు మాత్రం చైతన్యుని మార్గం ఏ మాత్రం వదలలేదు. మంచి వెంబడే చెడ్డకూడా వస్తుంటుంది. చెడ్డలేకుండా మంచిలేదు. మంచి లేకుండా చెడ్డలేదు.

> **"మంచి చెడ్డలు రెండుగా పొందియుండు**
> **వీటి విడదీయనెవ్వరి వశముకాదు**
> **సుఖము ప్రత్యేకముగ యెందు చూడబోము**
> **కష్టము ఫలించనేని సుఖమటంద్రు"**

కనుక మన సుఖమంతా కష్టమునందే ఉంటున్నాది. ఈ విధంగా తల్లి సంకల్పములచేత కుమారుడు చైతన్యుడు సత్పురుషునిగా మారిపోయినాడు. **కనుక తల్లులు తమ భావాలను ఉత్తమమైన భావాలుగా పెంచుకోవాలి. సత్యమైన సంకల్పాలుగా తీర్చిదిద్దుకోవాలి. ఉత్తమ ప్రవర్తనలో మెలగాలి. అప్పుడే వారికి ఆదర్శవంతమైన పుత్రులు కలుగుతారు.**

భారతదేశము పవిత్రభూమి, పుణ్యభూమి, యోగభూమి, ఎంతత్యాగం మనం చేస్తామో, అంత తేజము మనయందు ఉట్టిపడుతుంది. ఈమధ్య పేపరులో ఒక విషాదకరమైన వార్తను చూచాను. కుమారునికి అన్నం పెట్టలేక ఎలుకల మందు తాను త్రాగింది, కుమారుని చేత త్రాగించింది. ఇద్దరూ మరణించారు. నాకు చాలా కష్టంవేసింది. ఇది పవిత్రమైన భారతదేశం. ఇది త్యాగభూమి, ఇది అమృతవర్షిణి. ఇలాంటి పవిత్రమైనభూమిలో, అన్నపూర్ణక్షేత్రమని పేరుపొందిన ఈదేశంలో, కుమారునికి ఇంత అన్నం పెట్టలేక మరణించిందే తల్లి, అనే భావం నాకు కలిగింది. అన్ని కార్యములు ఆపివేశాను. గ్రామగ్రామానికి ఆహారం పంపాను. వస్త్రాలను పంపాను. మన పిల్లలు బంగారం లాంటివారు. కష్టపడ్డారు. అన్నిగ్రామాలు ఉదయంనుంచి సాయంత్రంవరకు తిరిగారు. అన్న వస్త్రాలు ప్రతి ఇంటికి పంచారు. గ్రామీణులకు అన్ని విధాలా సౌకర్యాలు చేశారు. అప్పుడు నాకు ఆనందం కలిగింది. త్యాగం చేసిన కొద్దీ తేజం పెరుగుతుంటుంది.

ఆనాటి నుంచి నేటివరకు నేను ఒకే విధంగానే భుజిస్తూ వస్తున్నాను. ఉదయం భజన తరువాత ఇంత సంకటి, ఆకుకూరపచ్చడి తీసుకుంటూ వచ్చేవాడిని, దానిలో ఈనాటికీ ఏమాత్రం మార్పులేదు. ఆ చిన్న భోజనం చేతనే నాలో తేజం అభివృద్ధి అవుతూ వచ్చింది. ఎందువలన? ప్రజోపకారమే నాకు ప్రధానమైన ప్రమాణం. ప్రజల క్షేమమే పరమాత్మని యొక్క అందము. కనుక ప్రజాక్షేమం నిమిత్తమై ఈకార్యక్రమంలో పాల్గొనటము చేత ఎంతైనా ఆనందం కలుగుతుంది.

నేను చిన్నగా నడుస్తుంటుంటే, స్వామి కేమైనా దెబ్బ తగిలిందేమో కుంటుకుంటూ నడుస్తున్నట్లు కనిపిస్తున్నదని చాలామంది భావిస్తున్నారు. నాకెట్టి దెబ్బ తగలలేదు. నాకు ఎట్టి జబ్బులూరాలేదు. మెల్ల మెల్లగా ఎందుకు నడుస్తున్నానంటే, అందరికీ ఎక్కువ సమయం దర్శనమివ్వాలని భావిస్తున్నాను. నాకు ఎట్టి కాళ్ళ నెప్పులూ లేవు. ఎట్టి బాధలూ లేవు. నా ఆనందం దినదినాభివృద్ధి పొందుతున్నది. కనుక

ప్రజాసేవే ప్రాణసమానమని మీరందరూ భావించాలి. అప్పుడు మీ తేజస్సు కూడా దైవ తేజస్సుగా మారుతుంది. దైవము ప్రత్యేకంగా లేడు. దైవము ఏమందిరంలోనో ప్రత్యేకంగా ఉన్నాడని మీరు భావించకండి. **'దేహో దేవాలయః ప్రోక్తో, జీవో దేవస్సనాతనః'** మన దేహమే భగవంతుని దేవాలయం అనుకోండి. ఆ దేహములో వున్నటువంటి జీవుణ్ణే దేవునిగా భావించుకోండి. కనుక దేవుణ్ణి వెదకటానికి ఎక్కడికీ పోనవసరంలేదు. అంతర్ దృష్టిని అభివృద్ధి పరచుకోండి. అక్కడనే నీకు ఆనంద స్వరూపుడు కనిపిస్తాడు. దైవమనేటటువంటివాడు మనకంటే వేరుకాదు. మనమే దైవస్వరూపులం. మానవుడు... మానవుడు... అని దేహాభిమానం చేత చాలా పొరబడు తున్నారు. **కనుక దేహాభిమానమును క్రమక్రమేణా తగ్గించు కోండి. దైవాభిమానమును పెంచుకోండి.** అప్పుడే మానవుడు దేవుడైపోతాడు. మానవుడు, దేవుడూ ప్రత్యేకంకాదు. ఈ రెండూ బింబప్రతిబింబములే. కనుక దేవుడు మనలోనే ఉంటున్నాడు, మనయందే ఉంటున్నాడు. ఇది కేవలం జీవరహితమైనగుడి. దీనిలో దేవుడు రావటంచేతనే ఇది కదలాడుతూ వస్తున్నది. ఈ Vibration నిజమైనటువంటి ప్రాణము. దీనిని ఆలోచింపజేసేటటువంటి Radiation దీనికి తగినటువంటి జ్ఞానము. వైబ్రేషన్ ప్రాణము. Wisdom Power అనేటటువంటిది జ్ఞానము. ఈ రెండూ దైవము యొక్క శక్తులే. అందుకే **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'** అన్నారు. సత్య మార్గంలో మనం ప్రవేశిస్తే, అదే బ్రహ్మతత్త్వము. ఇట్టి బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవడానికి ఎక్కడికో పోనవసరంలేదు. ఎక్కడ ఉన్నాడు దైవం? నాలోనే ఉన్నాడని భావించాలి. ఈ దేహం తన యొక్క ఇల్లు అని భావించాలి. అప్పుడే మనలో ఎక్కడలేని ఆనందం ఉట్టిపడు తుంది. ఎక్కడలేని శక్తి మనలో ప్రవేశిస్తుంది. సర్వశక్తులకూ మనమే అధిపతులమైపోతాం. కనుక ఈ శక్తిని పోషించ డానికి తగిన కృషి చేయండి. అయితే ఇది అంత సులభం కాదు. అనేక జన్మజన్మల సంస్కారముల చేతనే, ఇలాంటి ప్రాప్తి మనకు లభిస్తుంటుంది. ఏ పని అయినా చేయండి. ఇదంతా దైవకార్యమేనని భావించండి. దైవం కానిది వేరొకటి లేదు, అంతా దైవమే. "సర్వకర్మ భగవత్ ప్రీత్యార్థమ్" అని చేయండి. ఈ విధమైన సద్భావములు ఆనాటి తల్లులు పెంచుకోవటంచేతనే, ఆనాటి వారి పిల్లలు సత్పురుషులుగా అభివృద్ధి అయినారు. ఆదర్శవంతమైన జీవితాన్ని లోకానికి అందిస్తూ వచ్చారు. ఈనాడు కూడా భారతదేశం అన్ని దేశములకంటే మిన్నగా ఉపాధ్యాయ స్థానమునందు ఉంటున్నది. కాని మన దుష్ప్రవర్తనవలన ఆ ఉపాధ్యాయ స్థానమును కోల్పోతున్నాం. ఈ లోకంలో ఎందరో పండితు లున్నారు, విద్యావంతులున్నారు, మేధావులున్నారు. కాని వీరిలో స్వార్థస్వప్రయోజనాలు అభివృద్ధి కావటం చేత, అంతా క్షీణించి పోతున్నది. కన్నకుమారునైనా, కట్టుకున్న భర్తనైనా సరే మందలించాలి. అదియే నిజమైనటువంటి ఆదర్శము. తప్పును మందలిస్తూ రావాలి గాని, క్షమిస్తూ పోరాదు. ఆ క్షమించటం కూడనూ సరియైన మాటలతో చెప్పాలి. మంచిగా చెప్పాలి. కటువుగా మాట్లాడరాదు. మృదు మధురమైన భాషలో ఉండాలి.

భారతదేశము అనాది కాలము నుండి ఆదర్శమును అందిస్తూ వచ్చింది. అందువలననే మన దేశం అన్ని దేశాలకు ఉపాధ్యాయ స్థానమును చేకూర్చింది.

ప్రేమ స్వరూపులారా! ప్రేమను పెంచుకోండి. సత్యాన్ని వచించండి. కేవలం చదువు.... చదువు.... అని కాలమును వ్యర్థం గావించకండి. డిగ్రీలు తెచ్చుకోవటమా చదువు? కాదు.... కాదు....

"సద్గుణంబులు సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్షణ , కర్తవ్యపాలనంబు- నేర్పునదే విద్య"

కనుక సద్గుణములచేత, సదాచారములచేత సత్ప్రవర్తనల చేత జీవితాలను ధన్యం చేసుకోండి. ఇట్టి సద్గుణములను పెంచు కున్నప్పుడే, ప్రాచీన సంస్కృతిని ఉద్ధరించిన వారమవుతాము, పునరుద్ధరించినవారమవుతాం.

*(ది. 19-11-2000న ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)*

## ఆణిముత్యాలు - అనుభవసత్యాలు

1. నాలుక ఉన్నవాడు నాలుగు దిక్కులు తిరుగుతాడు.
2. నిందలేనిదే బొందె పోదు.
3. నిజము చెప్పేది పసిబిడ్డలు, తప్పతాగినవాళ్ళు.
4. నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరుగువాడే ధన్యుడు.
5. నోరు మంచిదయితే, ఊరు మంచిదవుతుంది.

# ఆచరించండి! ఆనందాన్ని పొందండి! లోకానికి ఆనందాన్ని అందించండి!!

"మంచితనమునందు మానవత్వమునందు
నీతియందు నిజజాతియందు
ఆచరించి చూపు అతడె సాధకుడగును
ఉన్నమాట తెలుపుచున్నమాట"

ప్రేమస్వరూపులారా!

ప్రపంచం పవిత్రమైన గుణములతో కూడినటువంటిది. కాలము చాలా ప్రధానమైనది. హృదయము మృదువైనటు వంటిది. మనసు మధురమైనటువంటిది. ఇట్టి ప్రకాశవంత మైనటువంటి, ఈ దేహమునందు ఉండినప్పటికినీ, మనం నిత్యసత్యమైన దివ్యత్వాన్ని గుర్తించుకోలేకపోతున్నాం. కుటుంబంతో జీవించే వ్యక్తులు, ఈ విధమైన పవిత్రమైన హృదయమును, మృదుమధురమైన మనసును పొందలేక పోతున్నామేనని విచారిస్తుంటారు. కుటుంబం, కంటికి వేసుకున్న అద్దాల (కళ్ళజోడు) వంటిది. కంటికి గ్లాసులు అడ్డంగా ఉన్నాయిగాని, దృష్టికి మాత్రం అవి సహాయం చేస్తుంటాయి. కనుక మనకు అడ్డుతగిలేటటువంటి కష్టము లకు, దుఃఖములకు, విచారములకు మనం ఏమాత్రం మార్పు చెందగూడదు. అవి మన సాధనకు సహాయమే చేస్తాయిగాని, అసహాయము చేయవు. అట్టి విశ్వాసమును సాధకుడు దృఢపరచుకోవాలి. ఎట్టి పొగయో, అట్టి మంట. ఎట్టి మంటయో, అట్టి వర్షము. ఎట్టి వర్షమో, అట్టి పంట. ఎట్టి పంటయో, అట్టి వంట. మనం ఎలాంటి భావమును అభివృద్ధి పరచుకుంటామో, అలాంటి భావములకు తగినటు వంటి మేఘములు తయారవుతాయి. ఎట్టి మేఘములో, అట్టి వర్షము. అనగా ఎట్టి భావములో, అట్టి కర్మలను మనం ఆచరిస్తాం. మనం ఎట్టి కర్మలను ఆచరించుదుమో, అట్టి ఫలితమునే మనం పొందుతాం. ఆ ఫలమే మన భోజనం.

ఒక చిన్న ఉదాహరణ. ఒక రాయిని తీసుకొని బావిలో విసరండి. ఆ రాయిపడినచోటి నుండి అలలు ప్రారంభ మవుతాయి. మన కంటికి కనిపించనంతవరకూ ఈ అలలు ప్రాకిపోతుంటాయి. బావి అంతా అలలతో నిండిపోతుంది. అదే విధముగనే మన సంకల్పములనే చిన్న రాయిని, మన మనసనే బావిలో విసిరినప్పుడు, ఆ బావి అంతా అలలతో చేరిపోతుంది. అయితే ఈ మనసనే బావిలో బయలుదేరినటు వంటి అలలు ఎంతవరకు పోతాయి? నఖశిఖపర్యంతం, దేహమంతా ప్రాకిపోతాయి. కనుక దేహమంతా ఆ అలల యొక్క ప్రభావంతోనే నిండిపోతుంది. కంటిలో ఆ అలలు చేరినప్పుడు, నీవు ఎలాంటి భావంతో విసిరావో, అలాంటి భావములే నీ దృష్టిలోనికి వస్తుంటాయి. నీ చెవుల యందు చేరినప్పుడు, అలాంటి శబ్దములే నీకు వినిపిస్తుంటాయి.

## భగవాన్ సాయి దివ్య బోధ

అవి హస్తములలో ప్రవేశించినప్పుడు, అలాంటి కర్మలనే నీవు ఆచరిస్తావు. పాదములలో ప్రవేశించినప్పుడు, అలాంటి ప్రదేశములకే నీవు నడుస్తావు. కాబట్టి మన భావములను పవిత్రమైనవిగా పెంచుకోవాలి. పవిత్రమైన భావములు మన హృదయములో ప్రవేశించుతే, ఈ హృదయ ప్రభావం వలన సర్వాంగములు పవిత్రములౌతాయి. అపవిత్రమైన భావములు మన హృదయంలో ప్రవేశించుతే, అన్ని అంగములయందునూ అపవిత్రమైన కర్మలే ఉద్భవిస్తాయి. కనుక మన భావములను సరియైనవిగా పెంచుకొనినప్పుడు, ప్రపంచమంతా పవిత్రమైనదిగా రూపొందుతుంది. అందువలన మన భావములను పవిత్ర మైనవిగా అభివృద్ధి పరచుకోవాలి. మనం మృదువైన, మధురమైన మాటలు నేర్చుకోవాలి. పవిత్రమైన కర్మలలో ప్రవేశించాలి. ముఖ్యంగా సాధకులు తమ మనసును మృదువైనదానిగా మార్చుకోవాలి. భగవంతుడు ప్రసాదించిన ఈ మానవ జీవితమును వ్యర్థంగా వినియోగించరాదు. హృదయంలో పవిత్రమైన ప్రేమను పెంచుకోవాలి.

మన హృదయం Tank వంటిది. పంచేంద్రియములు Taps వంటివి. Tank ను పవిత్రమైన ప్రేమ అనే నీరుతో నింపినప్పుడు Taps లో అపవిత్రమైన, కలుషితమైన నీరు ఎలా వస్తుంది? హృదయములో పవిత్రమైన భావములను నింపుకొనినప్పుడు, చేతులతో అపవిత్రమైన పనులు చేయటానికి వీలుకాదు. చెవులతో అపవిత్రమైన విషయాలు

వినుటకు వీలుకాదు. కన్నులతో చెడ్డవిషయాలను చూడలేవు. కనుక హృదయమును పవిత్రమైన భావములతో నింపుకోవాలి.

'నాలుక' అన్ని అంగములలో ప్రధానమైనది. భగవంతుడు అందించినది దివ్యమైన దైవనామము. ఆ నామమును నీవు ఉచ్చరించాలి. ఆ నామరూపాన్ని నీవు దర్శించు. అందు వలననే అన్నింటికంటే ముఖ్యమైనది 'జిహ్వ'. కనుక సత్యమైన వాక్కును పలకాలి. ఈ సత్యము నుండియే సర్వమూ ఆవిర్భవిస్తుంది. **"సత్యమ్మునందుండే, సత్యమ్మునందణిగే, సత్యమ్ము నందుండే"**. అంతా సత్యమే ప్రకాశిస్తుంది. కనుక

**"నీటియందె పుట్టి, నీటియందె మునిగి**
**నీటియందణు ంగు నీటి బుడగ**
**నరుడు బుద్బుదంబు నారాయణుడు నీరు"**

నరుడు నీటి బుడగలాంటివాడు. కాని నారాయణుడు నీరు. ఆ నీటినుండి ఆవిర్భవించినటువంటివే ఈ బుడగలు. నీరు వేరు, బుడగలువేరు కాదు. ఈ రెండింటికి అవినాభావ సంబంధము ఉన్నది. నీరు రుచివేరు, బుడగల రుచివేరు కాదు. మనం నారాయణునినుంచి ఆవిర్భవించినటువంటి వారం. దైవము నుండి ఆవిర్భవించినటువంటి మనం, దైవ భావములనే నింపుకోవాలి. అయితే వచ్చే చెడు భావములు ఎక్కడ నుంచి వస్తున్నాయని మీరు ప్రశ్నించవచ్చు. ఈ చెడ్డ భావములు లౌకికమైన, భౌతికమైన, ప్రాకృతమైన ఈ ప్రపంచంలో మనం సంచరించేటటువంటి అనుభూతులే అవి. కనుక ఈ చెడ్డను మనం ఏమాత్రం తీసుకోకూడదు. ఈ విషయంలో మనం కొంత విచారణ చేయాలి? ఇవి నా హృదయము నుంచి వచ్చినవా? లేక నా ప్రవర్తన వలన వచ్చినవా? అని విచారించాలి.

మన శ్రీనివాస్ చెప్పాడు. 165 దేశాల నుండి ప్రతినిధులు వచ్చారని చెప్పాడు. Countries are many. But Earth is One. (దేశములు అనేకం, కాని భూమి ఒక్కటే). మనకు ప్రధానం దేశముల సంఖ్యకాదు.

**"శృంగారములు వేరు బంగారమొక్కటే"**. 'Beings are many, But Breath is One'. కనుక మొట్టమొదట ఈ ఏకత్వాన్ని గుర్తించటానికి ప్రయత్నించాలి. ఆకాశమును చూడండి! Stars are many. But, Sky is One. (చుక్కలు అనేకం, ఆకాశం ఒక్కటే). మన హృదయమే ఆకాశము. మన Thoughts (భావములు), ఈ Stars. ఇట్టి ఏకత్వాన్ని గుర్తించుకుంటూపోయినప్పుడే దివ్యత్వమనేది ఆవిర్భవిస్తుంది. కనుక దైవత్వం అనేది ఒక్కటే.. ఒక్కటే.. అని విశ్వసించాలి. 'అల్లా' అని పిలవండి! 'జీసస్' అని పిలవండి. హిందువులు అనేక పేర్లు పెట్టుకున్నారు. ఎన్నిపేర్లు పెట్టుకున్నా దైవం ఒక్కడే. అట్టి విశ్వాసమును దృఢంగా పెంచుకోవాలి. అప్పుడు బేధములకే అవకాశం ఉండదు.

**దివ్యాత్మస్వరూపులారా!** మీరందరూ మొట్టమొదట ఏకత్వాన్ని అభివృద్ధి పరచుకోండి. ఇతర మతములను ఏమాత్రం విస్మరించకండి. ఏ సాధనలను, ప్రార్థనలను విమర్శించకూడదు. ఎవరి సాధన వారిది, ఎవరి ప్రార్థన వారిది, ఎవరి ఆనందం వారిది. నీ మార్గమును నీవు మార్చు కోకుండా చూచుకో. నీయందున్న దుర్గుణములను మాత్రం త్యజించు. ఇదే వేదం చెప్పింది. **"నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వమానశుః"**. అన్నింటికంటే 'త్యాగం' ముఖ్యమైనది. కాని ఈనాటి లోకంలో కోరికలు పెరుగుతున్నాయేగాని, త్యాగం ఏమాత్రం కనిపించటం లేదు. దేశాభిమానం అనేది కూడా మరచిపోతున్నారు. దేహాభిమానమును పెంచుకుంటున్నారు. ఏకత్వాన్ని విమర్శి స్తున్నారు. కాని, భిన్నత్వాన్ని ఆనందంగా అనుభవిస్తున్నారు. సంపాదించిన ధనంలో కొందరు, కొంత త్యాగం చేస్తున్నారు. ఎన్నిచేసినా ఇది త్యాగం అనిపించుకోదు. దైవత్వం విషయంలో చేసినటువంటిదే నిజమైన త్యాగం. మిగిలినటు వంటి త్యాగములలోపల అంతో, ఇంతో స్వార్థం, స్వప్రయోజనం ఉంటుంది. చేసిన త్యాగం కూడా సద్విని యోగం కావాలి. ఒక్క ఉదాహరణ చూడండి. ఈనాడు ఇంత విశాలమైన హాల్ నిర్మించాను. దీనికి అనేక విధముల అనేక మంది త్యాగం చేశారు. అందువలననే ఇంతమంది పవిత్రమైన సాధకులకు ఇది నిలయంగా నిలిచింది. లోకంలో ఎంతోమంది శ్రీమంతులున్నారు. కాని ఎవరైనా ఇటువంటి త్యాగం చేస్తున్నారా? కొందరు సత్రం కట్టిస్తారు, బావులు తీయిస్తారు. అయితే ఇక్కడ అన్ని మతములవారు, అన్ని దేశములవారు, అన్ని భాషలవారు ఒకే ఒక్క హాల్‌లో ఏకంగా జీవిస్తున్నారు. ఇలాంటి సద్వినియోగం అయ్యే త్యాగాలు చేయాలి. మనం చేసిన త్యాగం దుర్వినియోగం కాకూడదు.

ఈ మధ్య ఒక సంగీత కళాశాల కట్టించాం. అది కూడనూ ప్రపంచానికంతా ఉపయోగపడుతుంది. **భగవంతుడు గానప్రియుడు, గానలోలుడు.** అలాంటి గానమును నేర్చుకునే నిమిత్తమై సంగీత కళాశాల కట్టబడింది. ఏదో దేశము నుండి వచ్చిన ఒక వ్యక్తి ఈ సంగీత కళాశాల నిర్మించడానికి

సహకరించాడంటే, అతనికి ఎంత అదృష్టం ఉండాలి. మీరు వేరుగా భావించకండి. ఎక్కడ ఎవరు త్యాగం చేసినప్పటికినీ, అక్కడ అంతో, ఇంతో స్వార్ధం ఉంటూనే ఉంటుంది. ఒక్క సాయి సంస్థలయందు మాత్రమే స్వార్ధమనేదిలేదు. అంత స్వార్ధరహితమైనటువంటిది ఈ సత్యసాయి సంస్థలు. అలాంటి పవిత్రమైన స్థానంలో ఎంతైనా ఉపకారం చేయ వచ్చును. మిమ్ములను చేయమని నేను ఆశించటంలేదు. నేను చేయాలనుకుంటే ప్రపంచమంతా మార్పు చేయ గలను. మీ జన్మలు కూడా కొంత సార్ధకం కావాలనే నేను చెబుతున్నాను. మీరు ఆశించిన ఆశయాలు కూడా పవిత్రం కావాలి. ఎంతమందో శ్రీమంతులున్నారు. కాని, ఇలాంటి త్యాగబుద్ధి అందరికీ పుడుతున్నదా? ఎంత ధనంవుండి ఏమి ప్రయోజనం? చచ్చే సమయంలో ఒక మట్టికుండ కూడా తీసుకొనిపోలేరు. సంపాదించి.. సంపాదించి.. మూటగట్టి, బ్యాంకులలోపెట్టి, దాచిపెట్టి జీవితాన్ని గడుపుతున్నారేగాని, త్యాగం చేయాలనే పవిత్రమైన భావం మాత్రం కలగటం లేదు. లోపల దాచిన ధనం మట్టితో సమానమే. త్యాగం చేయాలి. అట్టి ధనంకాదు ముఖ్యం. హృదయ ధనం చాలా పవిత్రమైనది. హృదయాన్ని పవిత్రంగావించుకొనే నిమిత్తమై భగవంతునికి త్యాగం చేయాలి. షాపుకు వెళ్ళి పదిరూపాయిలు యిస్తే చేతిరుమాలా యిస్తాడు. అదే విధముగా ఒకటి యిచ్చుకోవాలి, రెండవది పుచ్చుకోవాలి. అయితే మనం భగవంతునికి,ఏమి యిచ్చుకుంటున్నాం? ఇచ్చుకున్నప్పుడే గదా! అతని దగ్గర నుండి ప్రేమో, దయో, ఏదో ఒకటి పుచ్చుకోవటానికి అవకాశం ఉంటుంది. అయితే భగవంతుడు ఏమీ యివ్వమని కోరడు. కాని అది నీ కర్తవ్యం (Duty). ఇచ్చుకుంటేనే పుచ్చుకోవడానికి వీలుంటుంది. మీరు రైల్వేస్టేషన్లలో చూస్తుంటారు. ఒక విలువైన నాణెము పెట్టటంతోనే ఒక టిక్కెట్టు మనకు వస్తుంటుంది. జడమైనవే సత్ఫలితాలను అందిస్తుంటాయి. అదే విధంగా సర్వశక్తిమయుడు, సర్వజ్ఞుడు, సర్వస్వరూపు డైనటువంటి భగవంతునికి ఇంత యిచ్చుకుంటే, అంత పుచ్చుకుంటావు. నిర్మలమైన ప్రేమను యిచ్చుకోండి. ధనాశను కొంతవరకు తగ్గించుకోండి.

"కోటీశ్వరునికైన కూడుగుడ్డయెగాని
మెరుగు బంగారంబు మ్రింగబోడు
కాలమేకాకున్న కర్రయే పాముగును
కలిసివచ్చిన మట్టి కనకమగును"

"పండితుడొకచోట పశువై పోవును
మూర్ఖుండొకచోట మునిగ మారు
వద్దురా బాబు ఈ ఆశలు పిచ్చిగాను
సాయివద్ద జేరి జీవితము ననుభవించు"

ఏ ఆశలు మనకు అధికంగా వద్దు. వద్దు.. వద్దు.. ఈ ఆశలు కేవలం లౌకికమైన జీవితాన్ని పెంచుతాయేగాని, పారమార్థిక జీవితాన్ని పెంచవు. కాని, మన కర్తవ్యాలను చక్కగా నిర్వర్తించాలి. కనుక చేతనయినంత పరులకు సహాయం చేయండి. త్యాగబుద్ధి చాలా అవసరం. దానిని పెంచుకోండి. సంపాదించండి, కాని త్యాగం చేయండి. సంపాదించటం కూడబెట్టుకోవటానికి కాదు. ఎవరు కూడ బెడుతుంటారో, నేడు కాకపోయినా, రేపయినా వారికి ప్రమాదం జరుగుతుంది. త్యాగం చేయండి. త్యాగం చేసినప్పుడే నీకు యోగం కూడా కుదురుతుంది. ఆ యోగమే, నీకు నిజమైన భోగము. కనుక సత్యసాయి సంస్థల వారందరూ మన శక్తికొలది త్యాగం కూడా చేయాలి. దుర్విని యోగం మాత్రం చేయకండి, సద్వినియోగం చేయండి.

ఈనాడు ఆశలు పెరుగుతున్నాయి. ఆశలు పెరుగుతున్న కొద్దీ అశాంతి కూడా పెరుగుతూ వస్తున్నది. కోరికలను తగ్గించుకోండి. ఉన్న ధనాన్ని సద్వినియోగం చేయండి. దుర్వాంఛలచేతనే మానవుడు క్రమక్రమేణా పశువై పోతున్నాడు. మానవత్వంలోవున్న దివ్యత్వాన్ని పెంచుకోవాలి గాని, పశుత్వాన్ని కాదు పెంచుకోవాల్సింది. ఈ పవిత్రమైన విషయాలు గుర్తుంచుకొనినప్పుడు, జీవితం ఎంతైనా సార్థకమవుతుంది. కనుక మనం ఖర్చులు తగ్గించుకుంటూ పోవాలి. ఖర్చులు తగ్గించుకున్నప్పుడే మన జీవితం చాలా శాంతిగా ఉంటుంది.

**"Do'nt Waste Food - Food is God**

**Do'nt Waste Time - Time waste is Life waste**

**Do'nt Waste Energy"**

ఈ మూడింటినీ ఆచరణలో పెట్టండి. ఈ పవిత్రమైన కర్మలను ఆచరించుతూపోతే తప్పక దివ్యత్వాన్ని పొంద గలరు. దీనిని పురస్కరించుకొనియే 'My Life is My Message' అంటున్నాను. Follow Me. నన్ను అనుసరించండి.

నేను అందరినీ ప్రేమిస్తుంటాను. ప్రేమలో ఎంతో పవిత్రత ఉన్నది. ప్రేమనే క్రమక్రమేణా జ్ఞానస్వరూపాన్ని పొందుతుంది. ఆ ప్రేమనే నన్ను యింతకాలం జీవింపచేసి,

ప్రజలందరికి పవిత్రమైన దివ్యత్వాన్ని బోధించడానికి వీలు కలిపించింది. ఈ ప్రేమనే పెద్ద ఆహ్వానం. నేను ఏ ఆహ్వానములూ పంపనప్పటికీ ఇంతమందిని ఇక్కడ చేర్చింది ఈ ప్రేమనే. ఈ సత్యమును విస్మరించకండి.

నాకు 75 సంవత్సరాలు నిండాయి. నేను ఎవ్వరినీ, ఏ మాత్రం అడుగలేదు, అడగటంలేదు. కాని ఇక్కడ ఎన్నో కార్యాలు జరుగుతున్నాయి. ఇవి ఎట్లా జరుగుతున్నాయి? నేను అడుగుతున్నానా? **నాకు సయాపైసా కూడా ఆస్తిలేదు. కాని ఎవరికీ తెలియనటువంటి ఆస్తి, నావద్ద దండిగా ఉన్నది. మీరందరూ నా ఆస్తే. ఇంత ఆస్తి ఎవరికి ఉన్నది? ఎవ్వరికీ లేదు. ఇచ్చినది, పుచ్చుకొనేది దానికి ఒక Limit (పరిధి) ఉంటుంది. దీనికి 'లిమిట్' లేదు. నాది Unlimited Property. నా ఆస్తి ప్రేమనే. ప్రేమనే పెద్ద ప్రాపర్టీ. ఆ ప్రేమ ఒక్కటే ఇంతమందిని ఆకట్టుకుంటున్నది.**

ఈ సమావేశమునకు విచ్చేసిన ప్రతినిధులకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. నేను చెప్పిన విషయాలను అన్నింటినీకాకున్నా కొన్నింటినైనా ఆచరణలోపెట్టి, సాధ్యమైనంతవరకు మననం చేసుకొని, వీటిని ఆచరణలో పెట్టి ప్రవర్తించుకుంటూ వస్తే, ప్రపంచమంతా బాగుపడుతుంది. **"లోకాస్సమస్తా సుఖినో భవంతు"** అని కోరుకోండి. కేవలం నా కుటుంబం మాత్రమే సుఖంగా వుండాలని కోరుకోకూడదు. సమాజమంతా సుఖంగా వున్నప్పుడే నీవు, నీ కుటుంబం కూడా సుఖంగా ఉండగలరు.

ఒక చిన్నకథ చెబుతాను. ఒకరాజు, ఒకరాణి ఉండేవారు. వారు గొప్ప త్యాగులు. ప్రజా సంక్షేమం కోసం కృషి చేస్తుండే వారు. ఒకసారి రాణీగారు, రాజుగారికి తలంటుతూ, కొంచం కంటి ధారలు కార్చింది. ఎదురుగావున్న అద్దములో రాజుగారు చూచి వెనుకకు తిరిగి 'నీవు ఎందుకు ఏడుస్తున్నావు' అని అడిగాడు. అప్పుడు రాణీగారు 'మీ తలలోని కొన్ని వెంట్రుకలు నెరసిపోతున్నాయి. వెంట్రుకలు నెరుస్తున్నాయి కాబట్టి, ఇది మొట్టమొదటి భగవంతుని పిలుపు. రెండవది కనుమసకలు వస్తాయి. మూడవది పండ్లు ఊడిపోతాయి. నాల్గవది శరీరం ముడుతలు పడుతుంది. కాబట్టి భగవంతుని నుండి మీకు మొదటి పిలుపు వచ్చింది. కనుక మీరు ఏనాడు మరణిస్తారో! ఏమిటో! అని నాకు దుఃఖం వచ్చింది' అన్నది. "ఇది సత్యమే. నేను గుర్తించలేదు. రేపటి దినమే నేను తపస్సుకు వెళ్ళుతాను" అన్నాడు రాజు. తపస్సుకు వెళ్ళాడు. ఒక అడవిలో ప్రవేశించాడు. తపస్సు చేస్తూవచ్చాడు. చావు రాకూడదనికాదు ఏమని?... "దేహమున్నంతలో తాను తెలియవలయు". ఈ దేహము పోయిన తరువాత నేను ఏమి తెలుసుకుంటాను? కాబట్టి నీ దివ్యత్వాన్ని గుర్తించడానికి నేను వచ్చానన్నాడు. నారాయణుడు ప్రత్యక్షమైనాడు. 'రాజా! నీకేం కావాలి?' అని అడిగాడు. అప్పుడు ఆ రాజు "నాకేమీ వద్దు స్వామీ! నీ సన్నిధే నా పెన్నిధి. నీ అనుగ్రహాన్ని అందించు" అన్నాడు. అంతేకాదు. "నా దేశంలోని వారందరూ సమానంగా ఉండాలి. బీదసాదలనేవారే ఉండకూడదు. ఆ విధంగా ఆశీర్వదించండి!" అన్నాడు రాజు. అప్పుడు దేవుడు "నీ కోరిక చాలా ఉత్తమమైనదే. కాని, అందరినీ సమానంగా పెట్టటానికి వీలుకాదు. ఇది సృష్టి. 'డ్యూయలిజం' చాలా అవసరం. 'A Man with Duel Mind is Half Blind' అన్నారు. కనుక Duel Mind అనేది ఉండాలి. అప్పుడే దీనిని 'జగత్' అని పిలవటానికి వీలవుతుంది. కాబట్టి నేను నీ కోరికను తీర్చడానికి వీలుకాదు" అన్నాడు. నాకిచ్చే తీరాలని రాజు పట్టుపట్టాడు. "సరే! నీవే అనుభవిస్తావు" అని ఇచ్చినాను పొమ్మన్నాడు. రాజు తిరిగి తన స్వస్థానం వచ్చేటప్పటికి, ఎక్కడ చూచినా పెద్ద పెద్ద భవనాలు. ఎవరూ నడచి ప్రయాణం చేయటం లేదు. కార్లలో, విమానాలలోనే తిరుగుతున్నారు. రాజు మాత్రం నడచుకుంటూ వచ్చాడు. మెయిన్‌రోడ్డు చూచాడు. అంతా చెత్త అటువారు, ఇటువారు తమ ఇళ్ళలోని చెత్తను రోడ్డుమీద వేస్తున్నారు. ఊడ్చేవారు ఎక్కడా కనిపించలేదు. Watch Man కూడా కనిపించలేదు. పాలెస్‌లోనికి వెళ్ళాడు. రాణీగారిని అడిగాడు. నీరు పెట్టించు! స్నానం చేయాలన్నాడు. పాలెస్ ఇంత మురికిగా ఉన్నదేమిటి? ఊడ్చేవారు ఏరి? అని అడిగాడు. అప్పుడు రాణీగారు "రాజా! నీవు కోరిన కోరికవలన పనిమనుషులు ఎవరూ రావటంలేదు" అన్నది. ఉతికేవారులేరు, ఊడ్చేవారులేరన్నది ఆ రాణి. మీరు భగవంతుని ఏమి కోరారని అడిగింది రాణి. అందరూ సమానంగా ఉండాలని కోరానన్నాడు రాజు. "ఇది సరియైన ఆలోచనకాదు. భగవంతుని సృష్టిలోపల ఎత్తుపల్లములు ఉండేతీరాలి. మంచి చెడ్డలు ఉండేతీరాలి. ఇవన్నీ ఉండినప్పుడే జగత్తులో జీవించడానికివీలవుతుంది. కాబట్టి మీరు కోరినటు వంటిది చాలా తప్పు" అన్నది. నేను కూడా తపస్సుకుపోతానని రాణీగారు కూడా బయలుదేరింది. నిర్మలమైన మనస్సుతో, నిశ్చలభావంతో తపస్సు చేసింది. నారాయణుడు ప్రత్యక్షమైనాడు. "అమ్మా! నీ కేమి కావాలి?" అని అడిగాడు. "స్వామీ! నా పతిదేవుడు వచ్చి మిమ్ములను ప్రార్థించగా, మీరు ఏమి

ఆజ్ఞ యిచ్చారు?" అని అడిగింది. 'శాశ్వతమైన జీవితాన్ని అనుభవించు. నీ రాజ్యమంతా నీవలె సుఖాన్ని అనుభవించాలి' అని అంగీకరించి వప్పుకున్నానన్నాడు నారాయణుడు. అప్పుడు రాణిగారు చెప్పింది. "ఇలాంటి మంచిరాజు వుంటుండి, చెడ్డ ప్రజలు గనుక వుంటే, ఈ రాజు వలన ప్రయోజనం ఏమిటి? కనుక నా ప్రజలు కూడా మంచివారుగా తయారుకావాలి" అని రాణి కోరింది. ఎంత విశాల హృదయం ఆమెది. కనుకనే నా ప్రజలు కూడా మంచివారుగానే తయారు కావాలని కోరింది ఆమె. మంచి రాజుకు మంచి ప్రజలే ఉంటుండాలని భావించి 'మా రాజుగారు వంద సంవత్సరాలు జీవించాలని ఆశీర్వదించారు కాబట్టి, ప్రజలందరూ కూడా నూరు సంవత్సరాలు జీవించేటట్లు ఆశీర్వదించండి!" అని రాణీగారు కోరింది. దేవుడు సరేనని అంగీకరించాడు. అప్పుడు రాణిగారు ఇంటికి వచ్చి రాజుగారితో చెప్పింది. అందరికీ దీర్ఘజీవితం ప్రసాదించబడింది. కాని చాకలి రావడంలేదు, మంగలి రావటంలేదు. వంటచేసేవారు రావటం లేదు. పనిచేసేవారు రావటం లేదు. అప్పుడు మరల రాజు తిరిగి అడవికి బయలుదేరాడు. తపస్సు చేసాడు. దేవుడు ప్రత్యక్షమయ్యాడు. "స్వామీ! మీరు ఆజ్ఞాపించారు. కాని నేను అనుసరించలేదు. మీ ఆజ్ఞను వినికూడా, నేను అనుసరించలేకపోవటం, నాది మహాపాపం. కనుక మీరు మొదట్లో చెప్పినట్లుగా ఎవరి స్థితికి తగ్గట్లు వారికి తగినటువంటి శక్తులు అందించండి. నేను లోగడ కోరింది తప్పే. నీ సంకల్పమే నిజసంకల్పము. మా భ్రాంతులు అసత్యమైనటువంటివి" అని ప్రాధేయపడ్డాడు రాజు. అప్పుడు నారాయణుడు "నాయనా! నేను మొదటే చెప్పాను. అప్పుడు నీవు నా మాట వినలేదు. కనుక ఇటువంటి అవస్థలకు గురియైపోయినావు. అందరూ దీర్ఘజీవితాన్ని అనుభవిస్తూనే ఉన్నారు. సంపదలకు ఏ మాత్రం కొదవలేదు. కాని ప్రయోజనం ఏమిటి? సుఖం లేదు. సుఖం లేనప్పుడు ఏమివుండి ఏమి ప్రయోజనం? Happiness is Union with God. కనుక భగవంతునితో సమానమైనటువంటి తత్త్వాన్ని నీవు అనుసరించినప్పుడే, నీవు బాగుపడుతావు. నీవు వెళ్ళు. సహజమైనటువంటి రాజ్యం తయారవుతుంది" అన్నాడు నారాయణుడు. తిరిగి తన స్వస్థానమునకు వెళ్ళేటప్పటికే, స్వప్న దృశ్యములవలె మారిపోయింది. అది ఒక కలగా వచ్చింది. కలలో వచ్చినవి ఎంత కాలం ఉంటాయి? "కలలో చూచిన మిద్దెలు, మేడలు కన్నులు విప్పిన లేవుగదా! "అక్కడ ప్రవేశించేటప్పటికే అంతా శుభ్రంగా కనిపించింది. ఎవరి పనులు వారు చేస్తున్నారు. ఎవరి కర్తవ్యం వారు నిర్వర్తిస్తున్నారు. దానిని చూచిన రాజు ఆనందించాడు.

భగవంతుని సంకల్పం పవిత్రమైనటువంటిది. కష్టం యిచ్చినా, సుఖం యిచ్చినా మన మంచికోసమేననే విశ్వాసంతో, ధైర్యంతో అనుభవించాలి. సుఖంలో భగవంతుని విస్మరించటం, కష్టంలో స్మరించటం కాదు. సుఖదుఃఖములు రెండింటిని సమంగా స్వీకరించడం నేర్చుకోవాలి. ఎలాంటి కష్టములొచ్చినా భగవంతుని వదలరాదు. కష్టములను సవాలుగా స్వీకరించాలి. భగవంతునిపై సర్వవేళలా విశ్వాసం ఉంచాలి. విశ్వాసం పవిత్రమైనది, సార్థకమైనది. అట్టి అచంచలమైన విశ్వాసాన్ని ప్రతి ఒక్కరూ కలిగి వుండాలి. అది ఎప్పుడూ ఆనందంగా ఉంటుంది. దానిని మనం కోరాలి. ఈనాడు ధనం వస్తుంది, రేపు పోతుంది. ఎవరో ఒకరు కాజేయవచ్చును, టాక్సుల రూపంలో పోవచ్చును. ఎవరికి యిచ్చి ఏమి ప్రయోజనం? ఉన్నంతవరకు త్యాగం చేయండి. త్యాగబుద్ధి లేనప్పుడు జీవితంవుండి ప్రయోజనంలేదు. అమృతత్వాన్ని పొందడానికి త్యాగమే ప్రధానం.

విద్యార్థులారా! ప్రతినిధులారా! విన్నటువంటి విషయాలలో కనీసం ఏ ఒకటి రెండింటినో ఆచరించండి. ఆచరణలో సాధించి మీరు ఆనందాన్ని పొందండి! లోకానికి ఆనందాన్ని అందించండి! అప్పుడు మీరు విన్నది సార్థక మవుతుంది. ఈ పవిత్రమైన భావాలను ఆచరణలో పెట్టి లోకానికి శాంతి నందించండి. లోకశాంతి ప్రార్థనలతోరాదు, వ్రతాలతోరాదు, ఆరాధనలతో రాదు. లోకశాంతి మన ప్రవర్తనతోనే వస్తుంది. చేసి చూపించండి. అదే నిజమైన భక్తి. అవే నిజమైన సేవలు.

*(ది. 24-11-2000న ప్రశాంతి నిలయంలో జరిగిన సమారోప ఉత్సవంలో భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)* ☆



ప్రశాంతి నిలయంలో భగవాన్ బాబావారిచే
ది. 18-11-2000న ప్రారంభించబడిన 'చైతన్య జ్యోతి' మ్యూజియం

# ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి జన్మదినవేడుకలు

"గణానాం త్వా గణపతిగుం హవామహే" వేద పఠనంతో సాయికుల్వంత్ మారుమ్రోగిపోయింది. గణపతి ప్రార్థనతో మొదలుపెట్టి స్వామి, లోపల మందిరం చుట్టూ ప్రదక్షిణ చేసి గ్రామసేవకు బయలుదేరింది సాయిసైన్యం. భగవాన్ సత్యసాయిబాబాకి జై...... అని నినదిస్తూ అన్న వస్త్రాదులతో లారీలు, కార్లు, ట్రాక్టర్లు, వాటితో పాటు స్వచ్ఛమైన తెల్లని బట్టలను ధరించి స్వామి ఆజ్ఞ శిరసావహించి ఆశీస్సులందుకొని ఆ పిల్లలందరూ బయలు దేరుతూ ఉంటే చూడముచ్చటగా, కన్నుల పండువుగా ఉన్నది. ఆనాడు రాక్షస సంహారానికి ఆ రామదండు బయలుదేరింది. అది మనము చూడలేదు. ఈనాడు సత్య ధర్మ శాంతి ప్రేమ లను వెదజల్లడానికి శ్రీ సాయిరామదండు బయలుదేరింది, కనులారా చూచిన నా జన్మ ధన్యం అనుకున్నాను.

ఈరోజు కార్తీకపూర్ణిమ, మహాపర్వదినం, ఈ ప్రశాంతి నిలయమే కైలాసం. ఆ ఈశ్వరుడే, ఈ సాయీశ్వరుడు. ప్రదోష సమయంలో స్వామి దర్శనం దొరకటం కన్నా మహద్భాగ్యం మరేమున్నది? ఈ చంద్రశేఖరుడు, తన యొక్క సహజమైన చల్లని చిరునవ్వు వెన్నెలను వెదజల్లుతూ అందరి మధ్యా తిరుగుతూ ఉన్నాడు. ఈరోజునకు మరొక విశేషమున్నది. ప్రపంచవ్యాప్తంగా అఖండభజన జరిగేది ఈరోజుననే. రేపు సంధ్యాసమయంతో అది పూర్తవుతుంది. భగవన్నామంతో సాయికుల్వంత్ పులకరించిపోతున్నది. పైన తిరిగే పక్షులుకూడా తమ కలకలారావములతో సాయిని కీర్తిస్తున్నాయి. మందిరం చుట్టూ ఉన్న చెట్లుకూడా భక్తులకు సేదతీరుస్తూ తమ యొక్క సేవను అందిస్తున్నాయి. ఈరోజు స్వామి, కాలేజి పిల్లలందరికీ ఆడపిల్లలకు చీరెలు, మగపిల్లలకు ప్యాంట్లు షర్ట్లు పంచారు. అంతకుముందు ఇచ్చారుట. అయినా మళ్ళీ ఇచ్చారు. తల్లి ప్రేమ గదా! మధ్యాహ్నం 2గం 15నిముషాలకు మందిరంలో ప్రవేశించిన స్వామి రాత్రి 7గం విశ్రాంతికై వెళ్ళారు. 12వతేది సాయం కాలానికి అఖండభజన పూర్తి అయినది. పెద్ద పెద్ద గిన్నెల నిండా ఫలహారాలు వచ్చినాయి. రెండు చేతులతో రెండు కొబ్బరికాయలు ఒక దానిపై ఒకటి కొట్టి ఆ నీరును వాటిపై చిలకరించారు. స్వామి విభూతిని సృష్టించి వేశారు. అంతే **'అక్షయంబుగ కాశీ లోపల అన్నపూర్ణభవానివై'** అన్నట్లుగా ఎంతమంది వచ్చినా సరిపోయింది. పెద్ద ఆకులతో ప్రసాద వితరణ జరిగింది. అది అందరికీ అందిందో లేదోనని అటూ ఇటూ తిరుగుతూ ఉన్నారు స్వామి. పిరల రాత్రి 7గం విశ్రాంతికై వెళ్ళారు. నిన్న, ఈ రోజు తిరిగి తిరిగి ఆ చిన్న పాదములు ఎంత నెప్పి పుట్టాయో! కుర్చీలో కూర్చొని అన్నీ చెప్పవచ్చు గదా స్వామీ! అనుకున్నాను.

**కొమరగిరి జయప్రద**

13వతేదీ మధ్యాహ్నం గం॥ 3 మహిళలకు సందేశం అని ప్రకటించారు. నేను వెళ్ళేసరికి హాలు నిండిపోయింది. స్వామి కూడా 2గం కు వచ్చారు. దర్శనం బాగానే జరిగింది. తరువాత సందేశం లేదు ఏమీ లేదు. సాయిమాత తన యొక్క వస్త్రభాండాగారాన్ని తెరిచింది. అంతే! పట్టుచీరె మొదలు నేతచీరెల వరకు చేతికి ఏది వస్తే అది కుల్వంత్ లోని స్త్రీ లందరికి పంచి పెట్టారు. మొత్తం 5000 చీరెలు పంచారుట. స్వామి ప్రసాదంగా నాకు ఒక చీరె అందింది. 14వతేదీన కూడా సాయిసైన్యం గ్రామసేవకు వెళ్ళింది. 15వతేదీ సాయంత్రం పూర్ణచంద్రలో బాలవికాస్ పిల్లల సాంస్కృతిక కార్యక్రమాలు చాలా బాగా జరిగినవి. 16వతేదీ కూడా కన్నడ, రాజస్థాన్ బాలలకార్యక్రమాలు జరిగాయి. 17వతేదీ తెల్లవారేసరికి సాయికుల్వంత్ అంతా కళకళలాడు తున్నది. వివిధరకములయిన రంగురంగుల వస్త్రములు ధరించి భిన్నమయిన భాషలలో విభిన్న మతముల వారందరూ భిన్నత్వంలో ఏకత్వంగా సాయిసత్యనారాయణ వ్రతములు చేసుకున్నారు. సాక్షాత్తు శ్రీ సాయినారాయణుడు దగ్గరుండి యధావిధిగా వ్రతములు జరిపించారు. సాయంకాలం తమిళం, పంజాబ్ బాలవికాస్ కార్యక్రమాలు జరిగాయి. మందగమనంతో సాయిగీత ముందునడువగా, 18వ తేదిన

స్వామి రథోత్సవం కన్నుల పండువుగా జరిగింది. 19వ తేదీన మహిళాదినోత్సవం. రంగురంగుల పట్టుచీరెలు రెపరెపలాడుతున్నాయి. బ్యాండు మేళములతో ఆడపిల్లలు స్వామిని మందిరంలోకి తీసుకొని వచ్చారు. కాండిల్స్ పట్టుకొని ఆడపిల్లలు డాన్స్ చేశారు. భరతనాట్యం చేశారు. కొంతమంది, వయొలిన్స్ వాయించారు. మరికొంతమంది స్వామి మహిళలనుద్దేశించి మాట్లాడుతూ తల్లుల పాత్ర, పిల్లలయందు వారి ప్రవర్తన, వారి భావాలు ఎలా ఉండాలో చెప్పారు. మహిళలే భజన చేశారు. హారతి యిచ్చారు. స్వామి అందరికీ చీరెలు పంచారు. ప్రతిచోట టి.వి.లు పెట్టారు. దర్శనానికి లోటు లేదు. అయినా భౌతికమైన ఈ కళ్ళతో ఆ కరుణామూర్తిని ఒక్కసారి చూడాలని జనం తండోప తండాలుగ మందిరం నాలుగువైపులా నిలబడుతున్నారు. భక్తుల ఆర్తిని గ్రహించిన ఆర్తిహరుడు దర్శనం కూడా అలాగే ఇస్తున్నారు. అందరి ముఖాలలోనూ ఆనందమే, సంతోషమే. సంధ్యాసమయంలో మందిరమంతా లైట్లతో నిండిపోయింది. అది కైలాసమా? వైకుంఠమా! సత్యలోకమా! స్వర్గలోకమా! కాదు. నేను నిత్యము ధ్యానించే సర్వదేవతా తీత స్వరూపిణి ఆ సాయి లలితాపరమేశ్వరి నివసించే మణి ద్వీపమే ఇది. శ్రీ మహారాజ్ఞి శ్రీ సాయీశ్వరి అనుకున్నాను. 20వతేదిన స్వామి సంగీత కళాశాల ప్రారంభం చేసారు. స్వామి సంగీత ప్రియుడు గదా! అందుకని అది కూడా ఇక్కడ పెట్టాము. ఈ రోజు నుండి 'ఉచిత భోజనం.' అని చెప్పారు.

167 దేశాల ప్రతినిధులు వచ్చారుట. దైవశక్తి అంటే అదే. సాయి ఎంత శక్తిమయుడు కాకపోతే అంత మందిని అన్ని గంటలసేపు ఎలా కూర్చోపెట్టగలడు? అదే ప్రేమ యొక్క శక్తి అన్నారు భగవాన్ సాయి. వారం రోజులనుండి ప్రపంచశాంతికై నాలుగు వేదములే కాక శుక్లయజుర్వేదము కూడా పఠిస్తున్నారు. వేదఘోష ప్రశాంతి నిలయమంతా మారుమ్రోగిపోతున్నది. ఎంత మంది వచ్చినా స్వామి దర్శనం మాత్రం ఒకే సమయానికి జరుగుతుంది. అదే స్వామి యొక్క ప్రత్యేకత. 21వ తేదీ ప్రతినిధుల సమావేశం ఉదయం సాయంత్రం జరిగింది. జనం కదలలేదు.

ప్రతి రోజూ స్వామి ఇచ్చే బహుమానాలకు అంతులేదు. సూట్‌కేసులు, వాచీలు, బట్టలు, స్వీట్లు ఒకటేమిటి? మాకు ఏదీ దొరకలేదే అని ఎవరైనా అనుకుంటే అది వారి ప్రాప్తం. చేసుకున్న వారికి చేసుకున్నంత అన్నారు గదా! 22వతేదీ స్వామి పుట్టినరోజుకు ముందుగానే మంత్రి సామంత దండనాథులందరూ వచ్చేసారు. సాయిరాం! సాయిరాం! అనే భక్తుల పలకరింపులు, స్వామి ఇచ్చిన పట్టుచీరెల రెపరెపలు, ఒకటేమిటి? అంతా కోలాహలమే. స్వామి కోలాహల ప్రియుడు గదా ? స్వామి కూడా భక్తులందరికి తమయొక్క దివ్యసందర్శనము కలిగించాలని తమ యొక్క చిన్ని చిన్ని పాదములతో అటూ ఇటూ తిరుగాడుతూ చల్లని చూపులతో అందరిని చూస్తూ అమృతమయమైన పలుకులతో అందరినీ పలుకరిస్తూ ఆనందపరుస్తున్నారు. 23వ తేదీ చాలా సుదినం. పుణ్యదినం. అందరూ ఎంతో కాలంగా ఎదురు చూసే పర్వదినం. అదే స్వామి పుట్టిన దినం. మాధవుడు మానవునిగా మానవతామూర్తిగా, ప్రేమమూర్తిగా, కరుణామూర్తిగా ఈశ్వరాంబతనయుడుగా మానవుల నుద్ధరించటానికి ఆ పుణ్యమూర్తి పుడమిపై అవతరించిన శుభదినం. హిల్ వ్యూ స్టేడియంలో ఇసుక వేస్తే రాలనంతగా భక్త సందోహం. సత్వగుణమునకు ప్రతీక అయిన ధవళ వస్త్రమును ధరించి సత్యమూర్తి అయిన భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సాయి గీత ముందు నడువగా పండితుల వేదనాదాల మధ్య, పిల్లల బ్యాండ్ మేళాల నడుమ పూర్ణకుంభంతో నృత్యగీతాలతో ముందు నడువగా స్వామి స్టేడియం సభా మండపంలో ప్రవేశించారు. ఆ దృశ్యము చూడవలసినదే కాని చెప్పనలవిలేదు. బాణా సంచాలు ఆకాశంలోకి వెళ్లి వెలుగులు వెదజల్లుతూ శబ్దాలు చేస్తుంటే, దేవదుందుభులు మ్రోగినట్లు ఉన్నది. హెలికాప్టర్

నుండి పూలను వెదజల్లుతూ ఉంటే దేవతలు పుష్పవర్షం కురిపిస్తూన్నట్లుగా ఉన్నది. స్వామి సందేశం ప్రముఖుల ప్రశంసలు దేశ విదేశ గాయనీమణుల సంగీతాలాపన ఒకటేమిటి? లావణ్యారాము కనులారా చూడరే అన్నాడు త్యాగరాజు. ఈనాటి సాయి లీలా వైభవం చూసితీర వలసినదే. ఈ రోజు ఝూలా ఉత్సవం జరుగలేదు. అందు వలననే మా రూమ్‌లో ఉయ్యాల పాటలు, లాలిపాటలు, జోలపాటలు అన్నీ పాడుకున్నాను. ఈ రోజు ఉదయం సర్వధర్మ స్థూపం వద్ద మల్లెవంటి మనసున్న స్వామి తెల్లని వస్త్రములతో మూర్తీభవించిన ప్రేమమూర్తిగా దర్శన మిచ్చారు. 24వతేదీన డెలిగేట్స్ అందరూ వెళ్లిపోతున్నారు. భక్తులు కూడా కొంతమంది వెళ్తున్నారు. అందువలన స్వామి ఆడపిల్లను అత్తవారింటికి పంపించేటప్పుడు వెనుకటివారు చెప్పినట్లు అందరికి తమ ప్రసంగంలో బుద్ధులు చెప్పారు. అన్నీ చెయ్యలేక పోయినా కనీసం ఏ ఒక్కటి అయినా చేసి చూపించండి చాలు, అది ఇక్కడే చెయ్యనక్కరలేదు. మీరెక్కడ ఉన్నా నేనే మీవద్దకు వస్తాను అని అందరినీ ఆశీర్వదించారు. బ్రహ్మాండనాయకుని పుట్టిన రోజు చాలా బ్రహ్మాండంగా జరిగింది. ఆబాల గోపాలమును ఆనంద పరవశులను చేసినవి స్వామి జన్మదిన వేడుకలు. ●



# చైతన్య జ్యోతి



ప్రపంచంలోగల సాయిభక్తులందరూ కలిసి, స్వామి 75వ జన్మదిన సందర్భములో ఈ భవనమును స్వామికి చిరుకానుకగా సమర్పించగా, స్వామి ఆ భవనమునకు చైతన్యజ్యోతి యని నామకరణమొనర్చి, ది 18-11-2000న ఆవిష్కరించి మానవజాతికి అంకితము చేసారు.

సుమారు 27 కోట్ల రూపాయల ఖర్చుతో ఈభవనము నిర్మింపబడినది. భవనము ఖరీదు 8 కోట్లు; లోపల గల వస్తువులు 19 కోట్లు. ఇది ఒక మ్యూజియం అని చెప్పవచ్చు. 25 ఆగస్టు99 స్వామిచే శంఖుస్థాపన చేయబడి 18 నవంబరు 2000 ఆవిష్కరింపబడినది. 75 అడుగుల ఎత్తుగల ఈ భవనం ( మలేషియా, చైనా దేశ సుందర భవనముల వాస్తుశిల్ప కళలతో భారతదేశములో ప్రప్రథమముగా నిర్మింపబడిన విచిత్ర కట్టడము. దీని పై కప్పు (Roof) 2 కోట్లు విలువ. అంతా (Glazed Ceramic) పింగాణీ పెంకుతో నిర్మితము. 20,000 చ॥ అ॥ ప్లింతు ఏరియా. ఒక్క గ్రౌండు ఫ్లోరే 11,000 చ॥ అ॥ విస్తీర్ణము. అన్ని దేశాల సంస్కృతులూ క్రింది అంతస్థులోనూ , పై మూడు అంతస్థులలోనూ స్వామి చిన్నతనము నాటి- అవతార ప్రకటన, లీలలు, సాయి అవతార రాకను అన్ని దేశస్థులు జోస్యము చెప్పుట, మానవాళిని మంచిలోనికి ధర్మమార్గములోనికి మార్చుట నెమ్మది నెమ్మదిగా యావత్ప్రపంచము 'సాయి' బాటలోనికి మళ్ళించబడుట వంటి ఎన్నియో ఈ మ్యూజియంలో ప్రదర్శించబడినవి. ఒక చిన్న సినిమాహాలు, పుస్తక ప్రదర్శనశాల కూడా కలదు.

ఇందలి ప్రత్యేకతలు ఏమనగా, ఈ భవనము ముందు 36 అడుగుల ఎత్తు గల స్థూపము గలదు. ఆ స్థూపమునకు క్రింద, పైన రెండు పద్మములు. స్థూపము చుట్టూ 5 హంసలు - ( 5 మానవతా విలువలను తెలుపుచుండును). పైన గల పద్మము మధ్యనుండి స్వామి హస్తములోని చూపుడువ్రేలుపైకి చూపుచూ యావత్ప్రపంచ భారమును మోయు చున్నట్లుండును.

ఇది భారతదేశ చరిత్రలోనే విచిత్ర కట్టడము. **'21వ శతాబ్దపు ప్రపంచ వింత'** అని స్వామి నుడివిరి. తూర్పు-పడమర దేశాల కట్టడపు కలయిక . చైనాదేశపు పగోడా **'Pagoda'** వలె, యూరపు దేశపు శిల్పముతో కలసి, (Moorish Architecture) రెండు డోములు (Doncy) ఎడా, పెడా - **'టిటేనియం'** అను రేకుతో నిర్మింపబడింది. (Two domes of Moorish Architecture - Constructed into high technology material - **Titanium**). క్రీస్తు చిన్నతనమునాటి నిర్మాణము లను పోలి **'గోతిక్ ఎరా'** (Gothic Era) పద్ధతిలో రెండు ఆర్చిలు నిర్మింపబడినవి. భవనమునకు ముందుగల (Koi Pool) **'జల ఫౌంటెన్'** చైనా దేశ పద్ధతి ప్రకారము నిర్మింపబడినది. సింగపూర్, మలేషియా, చైనా ఇంజనీర్లు, భారతీయ ఇంజనీర్లు వారివారి Architecture ను మిళితం చేసి నిర్మించిన అద్భుత కట్టడము. ఈ భవనములోపల గల మ్యూజియమును పూర్తిగా దర్శించిన పిదప భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు పూర్ణావతారులని విదితముకాగలదు.

**- ఎన్.బి.ఎస్. రామారావు**



# పుట్టపర్తిలో ప్రపంచ మహాసభలు



తుర్లపాటి గిరీష్ బాబు

**Be A servant of God**
**Feel that you are an Instrument**
**In His hand let Him shape you**
**And use you as he knows Best.**

శ్రీ సత్యసాయి సేవాసంస్థల 7వ ప్రపంచమహాసభలు నవంబరు 20వ తేదీ సాయంత్రం 4 గంటలకు స్వామి తమ దివ్య హస్తాలతో జ్యోతిని వెలిగించి ప్రారంభించి, అందరి హృదయాలలో 'ప్రేమజ్యోతి' ని వెలిగించారు. సాయి కుళ్వంత్ హాల్ మొత్తం యావత్ భారతదేశము నుండేగాక 167 దేశాలనుంచి వచ్చిన వేలాది మంది ప్రతినిధులతో విద్యార్థినీ, విద్యార్థులతో నిండిపోయింది. అందరి వదనాలలో ఆనందం, ఉత్సాహం పెల్లుబికింది. కుళ్వంత్ హాల్ అంతా Divine Vibrations (దివ్య ప్రకంపనలు) తో నిండిపోయింది.

ఈ సదస్సు ప్రధాన లక్ష్యము The Journey with Sai - Glorious 75 years (సాయితో దివ్యమైన 75 సంవత్సరాల ప్రయాణం) అనే విషయాలను మననం చేసుకోవటమే. ఈ విషయమును మూడు భాగములుగా విభజించి ఈ సదస్సులో చర్చించబడింది. 1. స్వామి మొదటి దశ 25 సంవత్సరాలు (1926 - 50) 2. స్వామి రెండవ దశ 25 సంవత్సరాలు (1951 - 75) 3. స్వామి మూడవ దశ 25 సంవత్సరాలు (1976 -2000). ఈసదస్సులో జరిగిన మూడు Sessions లో స్వామితో గల సంబంధం, అనుబంధంవున్న ఎందరో ప్రముఖులు తమతమ అనుభూతులను, అనుభవాలను విశదీకరించారు. ఈ సదస్సును భగవాన్ బాబావారు ప్రారంభిస్తూ ప్రారంభోపన్యాసం చేసారు. 24వ తేదీ ఉదయం జరిగిన సమారోప ఉత్సవం (Validictory Function) లో స్వామివారు హితోపదేశం చేశారు.

మొదటి సెషన్స్‌లో స్వామి చిన్ననాటి స్నేహితుడు, సహవిద్యార్థి, బుక్కపట్నం నివాసిఅయిన శ్రీ జి.వి. సత్యనారాయణ గారు తన ప్రసంగంలో స్వామితో చిన్ననాటి అనుభూతులను కళ్ళకు కట్టినట్లుగా వివరించి అందరినీ మంత్రముగ్ధులను గావించారు. స్వామి చిన్ననాటి నుంచి ఆటలలో పాటలలో, చదువులో అందరికన్నా మిన్నగా ఉండి అందరికీ ఆదర్శంగా లీడర్‌గా ఉండేవారని, అందరినీ ఆకట్టుకొనే వారని చెప్పారు. పండరి భజనలు చేస్తూ, శ్రావ్యంగా పాడుతూ, భూకైలాస్, కృష్ణతులాభారం లాంటి నాటకాలలో రసవత్తరంగా నటిస్తూ అందరి ప్రశంసలను పొందేవారని చెప్పారు. ఎంత బీద స్థితిలో వున్నా, చిన్ననాటి నుంచి స్వామికి యివ్వటమే తెలుసుగాని, పుచ్చుకోవటం తెలియదన్నారు. చిత్రావతి ఇసుక తిన్నెలమీద పిల్లలందరినీ కూర్చోబెట్టి తినే పదార్థములను సృష్టించి యిచ్చేవారని, అమృతం సృష్టించి నాలుకమీద వేసేవారని, ఇంకా....ఇంకా...ఎన్నో.... ఎన్నో... దివ్యలీలలు చూపి స్నేహితులందరిని ఆశ్చర్యచకితులను చేసేవారని చెప్పారు. ఆ తరువాత అనంతపురం న్యాయవాది శ్రీ సత్యనారాయణగారు స్వామితో తన చిన్ననాటి అనుభవాలను వివరించారు. ఆ తరువాత చెన్నైకి చెందిన మేజర్ రామలింగం తాను ఏవిధంగా స్వామి భక్తుడైనదీ వివరించారు. చివరగా శ్రీమతి బషీరుద్దీన్ ప్రసంగిస్తూ తాను మొదట్లో సాయిని నమ్మలేదని, ఆ తరువాత స్వామిని అర్థంచేసుకొని, ఈనాడు ఆరాధిస్తున్నానని చెబుతూ, వారింట్లో స్వామి ప్రదర్శించిన మహిమలను వివరించారు.

ఆ తరువాత జరిగిన సెషన్స్‌లో మాజీమంత్రి శ్రీభాట్టం శ్రీరామమూర్తి మాట్లాడుతూ చినిగిన నిక్కరుతో, మాసికలు వేసిన చొక్కాను ధరించి, పేదరికాన్ని చిన్ననాట అనుభవించిన స్వామి, నేడు వేలాది మందికి చీరెలు, ధోవతులూ పంచుతూ, అన్నం పెడుతూ తన దివ్యత్వాన్ని ప్రదర్శిస్తున్నారన్నారు. ఆ తరువాత జయలక్ష్మి గోపీనాధ్ మాట్లాడుతూ మన మనసును స్వామి మీదనే కేంద్రీకరించి, స్వామికి సంపూర్ణశరణాగతి పొంది, ఆ దివ్యపాదాలను ఆశ్రయిస్తే, స్వామి యొక్క దివ్యత్వం ఎంతటిదో అర్థమవుతుందన్నారు. ఆ తరువాత కాలిఫోర్నియా నుండి వచ్చిన రాబర్ట్ మజాని మాట్లాడుతూ స్వామికి ఎలా చేరువై, దివ్యమైన

ఆనందాన్ని అనుభవిస్తున్నదీ వివరించారు. చివరగా శ్రీఇందూలాల్ షా మాట్లాడుతూ స్వామి ప్రకృతిని సహితం ఏ విధంగా కంట్రోల్ చేయగలరో వివరిస్తూ, వర్షమును నిలిపి వేసి బొంబాయిలో సభను ఏ విధంగా విజయవంతం చేసింది వివరిస్తూ, సర్వశక్తులూ స్వామి చేతిలో ఉన్నాయని చెప్పారు.

మూడవ సెషన్స్ లో మాజీ స్పీకర్ శ్రీ శివరాజ్‌పాటిల్ ప్రసంగిస్తూ స్వామియే సత్యమని, స్వామియే ప్రేమయని, స్వామియే సర్వస్వమని చెబుతూ ప్రకృతికి, కాలానికి, ఈ భౌతిక ప్రపంచానికి స్వామి అతీతులని, ఎక్కడ ప్రేమ, దయలు ఉంటాయో, అదియే స్వామి నివాసమని చెప్పారు. ఆ తరువాత జస్టిస్ భగవతి మాట్లాడుతూ స్వామి సమకాలీనులుగా ఉండటం మన అదృష్టమని, స్వామి మనలోనున్న అన్ని మలినాలను తీసివేసి, మేలిమి బంగారముగా తీర్చిదిద్దుతారని చెప్పారు. చివరగా అమెరికాకు చెందిన మైకేల్ గోల్డు స్టై మాట్లాడుతూ, 25 సంవత్సరాల వయస్సులో తాను స్వామిని ఎలా కలుసుకున్నది , స్వామి కరుణ తనపై ఎలా ప్రసరించింది చక్కగా వివరించి సభికులను ఆకట్టుకున్నారు. పుట్టపర్తికి అనేకసార్లు, అనేక సందర్భాలలో వెళ్ళాను. కాని ఇక్కడ జరిగిన ప్రపంచమహాసభలో ప్రతినిధిగా పాల్గొనే అవకాశం నాకు ఇప్పుడే కలిగింది. ఇదొక మరుపురాని అనుభవం, మరువలేని దివ్యానుభూతి. దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన మరువలేని మధురక్షణాలు. అంతా స్వామి సంకల్పమే. ✷

# భగవాన్ సాయి దివ్యశక్తి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు విజయదశమి శుభదినాన చేసిన ప్రకటనను అమలుపరచటానికి వందలాదిమంది విద్యార్థులు, అధ్యాపకులు గ్రామసీమలకు తరలి వెళ్ళారు. నవంబరు 1వ తేదీ నుంచి 14వ తేదీవరకు పుట్టపర్తి, కొత్త చెరువు, బుక్కపట్టణం మండలాలలో షుమారు 300 గ్రామాలలోను, ధర్మవరం - పట్టణంలోని వేలాది గృహాలవద్దకు వెళ్ళి, తలుపుకొట్టి స్వామివారు, ప్రసాదం ప్రత్యేకంగా పంపారని చెప్పి, గృహంలో ఎంతమంది వుంటే అంతమందికి స్వామి ప్రసాదమును అందించారు. ఈ విధంగా పదునాలుగురోజుల పాటు ఉదయం నుంచి సాయంత్రం వరకు ప్రసాదం వివిధగ్రామాలలో పంచటం విశేషం. ప్రశాంతినిలయంలో బయలుదేరేటప్పుడు భజనలు చేసుకుంటూ, ప్రశాంతి నిలయ ప్రాంగణంలోని మందిరం చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణ చేసి, స్వామి వారి ఆశీస్సులను గైకొని, లారీలలో, ట్రాక్టర్లలో, వ్యాన్లలలో వేలాది ప్రసాదపు పొట్లాలను, ధోవతులను, చీరెలను తీసుకొని గ్రామసీమలకుతరలి వెళ్ళటం చూసే భక్తులు, ఆనందంతో కేరింతలు కొడుతూ భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి జై.... జై... అంటూ నినాదాలతో మందిరమంతా నిత్యమూ మారుమ్రోగిపోయేది. ఇటువంటి కోలాహలదృశ్యము నేను ఎక్కడా, ఎప్పుడూ చూడలేదు. స్వామి మాట సత్యం, స్వామి చెప్పేది సత్యం. చెప్పినమాటను అమలుపరచడం స్వామి వారి ప్రత్యేకత. ప్రతి రోజు రాత్రి కొన్ని వందలమంది సేవాదళ్ వారు నిద్రలేకుండా ఆహారపు పొట్లాలు కట్టేవారు. అతిరుచికరంగా పులిహోర, ఫ్రైడ్ రైస్, సాంబారన్నం, పెరుగన్నం తయారుచేసి పొట్లాలు కట్టి యివ్వటం వారికి నిత్యకృత్యమైంది. కోటి లడ్డూలు కూడా తయారు చేశారుట. వివిధ గ్రామాలలో ఆర్థికంగా వెనుకబడినవారి లెక్కలు కూడా తయారు చేసారుట. ఒక్కొక్క పేదకుటుంబానికి లక్షరూపాయిల చొప్పున Fixed Deposit చేసి, వచ్చే వడ్డీ ద్వారా, ఆ కుటుంబంలోని పేదపిల్లలకు అన్న వస్త్రసౌకర్యాలు ఏర్పాటు చేయాలని, వారికి విద్యా సౌకర్యములు అందించాలని స్వామివారి సంకల్పం గదా! సంకల్పించినది ఆచరణలో పెట్టటమే స్వామి ఆశయం. భారతదేశానికి పట్టుకొమ్మలు, గ్రామసీమలు గదా! భారతదేశసౌభాగ్యం, గ్రామసీమల పురోభివృద్ధి మీదనే ఆధారపడి ఉన్నది. ఈ మాట అందరూ చెబుతునేవున్నారు. కాని ఆచరణలో పెట్టేవారే కనిపించటంలేదు. విద్యా వైద్య నీటి సౌకర్యాలు లేక గ్రామీణులు ఎన్నో అవస్థలు పడుతున్నారు. ఆదుకొనేవారేలేరు. ~~ఈమధ్యకాలంలోనే తల్లి,~~ పిల్ల ఆకలితో అలమటిస్తూ అశువులు బాసిన సంఘటన వార్తను పత్రికలలో చూచి, ఎంతో మనస్తాపానికి గురియై, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ కార్యక్రమాన్ని చేబట్టి అమలుపరుస్తున్నారు. ఇది అందరికీ సాధ్యమయ్యేదికాదు. సాధ్యం చేయడానికి శక్తి అవకాశం, వనరులు గల ప్రభుత్వాలు కూడా పట్టించుకోవటంలేదు. 'దయగలహృదయమే దైవ మందిరం ' అని చెప్పిన భగవాన్ సాయి ఒక్కరే దీనిని అమలు చేస్తున్నారు. ఇదే వారి దివ్యశక్తికి నిదర్శనం.

– భరద్వాజ్



# పురుష సూక్తము

# 17

"ధాతా పురస్తా ద్యముదా జహార
శక్రప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వా నమృత ఇహాభవతి
నాఽన్యః పంధా అయనాయ మున్యతే॥"

**అర్థం :**

**ధాతా** : చతుర్ముఖ బ్రహ్మ పరబ్రహ్మ
**పురస్తాత్** : ప్రప్రథమంగా
**యమ్** : ఎవనిని
**ఉదాజహారః** : ఉదాహరణగా వాక్కున సంకల్పించెనో
**శక్ర** : ఇంద్రుడు, శతమఖుడు
**చతస్రః** : నాలుగు దిక్కులు
**ప్రదిశః** : దిక్కోణములు గల జగతిని
**ప్రవిద్వాన్** : ఎవని సంకల్పంగా తెలిసికొనెనో
**తమ్** : అట్టి పరమేశ్వరుని
**ఏవం** : ఈ రీతిగా
**విద్వాన్** : తెలుసుకొన్నవాడు
**ఇహ** : ఈ లోకంలో
**అమృతః భవతి** : మృతిలేనివాడవుతున్నాడు
**అయనాయ** : అమృత ప్రాప్తి కొరకు
**అన్యఃపంధా** : నవిద్యతే మరొక మార్గంలేదు

**వ్యాఖ్య :**

బ్రహ్మ నారాయణ నాభి కమలంలో ఉద్భవించాడు జన్మించి, జపించి, తపించి, జ్ఞానం పొంది ప్రప్రధమంలో ప్రణవ స్వరూపునిగా ఓంకారంతో ఎవనిని గుర్తించాడో!, ఎవని సంస్మరణతో సృష్టి చేయగలిగాడో!

శతమఖుడైన శక్రుడు దేవేంద్రుడై కూడా ఈ చతుర్దిశలు దిక్కోణాలుగల జగతిని ఎవరిదిగా తెలుసుకొన్నాడో! అట్టి పరమేశ్వరుని పరమేశ్వరతత్త్వాన్ని తెలుసుకొన్న విద్వాంసుడికి నిజంగా ఈ లోకంలో ఎప్పటికీ మృతిలేదు. అమృతసంస్థితుడు. అతడు అమృతపథంలో పరమాత్మలో తాదాత్మ్యం చెంది ఉంటాడు. ధాత అంటే చతుర్ముఖ బ్రహ్మ. ధాత ఉచ్చరించటం అంటే ప్రత్యక్ష అనుమాన శబ్ద ప్రమాణంగా ప్రణవాన్ని సంకల్పించటం.

వాక్కు దశలు నాలుగు. సంకల్పంలోని మూడుదశలూ వ్యక్తంకావు నాల్గవదైన 'వైఖరి' వినిపిస్తుంది. అంటే మూడు వంతులు లోపల ఉండి ఒక వంతు మాత్రమే ఇతరులకు తెలిసేది.

అలానే పరతత్త్వంలోని నాల్గవవంతు మాత్రమే విశ్వభువనం. మనకు కనిపించేది. ఇది పరమేశ్వర ప్రణవతత్త్వం. శక్రుడు శతమఖుడు. యజ్ఞరహస్యవేది. మహాయాగఫలాలు పొందిన వాడు. సర్వవేదకళాప్రవీణుడు. ప్రగాఢంగా విజ్ఞానం, ప్రజ్ఞానం, సుజ్ఞానం ఎరిగి ప్రయోగాలు చేసి సత్ఫలితాలు అందుకొన్నవాడు. అట్టి ఇంద్రుడు శ్రమించి జగత్ నిర్మాతను తెలుసుకొన్నాడు. మహా విద్వాంసుడైనాడు. బ్రహ్మేంద్రాదులు గుర్తించిన స్వామిని తెలుసు కొన్నవాడు మృతిలేనివాడే కదా! ఈ జ్ఞానఫలం 'సర్వహుత' యజ్ఞ ఫలం. ఈ యజ్ఞంచేయటం అంటే త్రికరణ శుద్ధిగా వైరాగ్య జీవితం గడుపుతూ తన ప్రజ్ఞను అంతర్యామి స్వామి ప్రజ్ఞలో హుతం చేయటమే. ఇదే ఆత్మాహుతి, ఇదే నరబలి, ఇదే నరమేధం, ఇదే అంతర్యాగం.

- జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

## బెంగుళూరు సూపర్‌స్పెషాలిటీ ఆసుపత్రి

ఈ సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి త్వరలో ప్రారంభంకానున్నది దీనికి అయిన ఖర్చు 500 కోట్ల రూపాయిలు. 1999 సెప్టెంబరులో దీని నిర్మాణం ప్రారంభమై, ఏడాది వ్యవధిలో పూర్తి అయింది. 2002 సంవత్సరం నాటికి, ఏటా 2 లక్షలమంది అవుట్ పేషెంట్స్ 15వేల మంది ఇన్‌పేషెంట్స్‌కు చికిత్స చేస్తారుట ప్రాథమిక పరీక్షల నిర్వహణకు 500 మంది కూర్చోనడానికి వీలుగా రిసెప్షన్, ప్రైమరీ స్క్రీనింగ్ కేంద్రం ఏర్పాటు చేసారు. కార్డియాక్ విభాగంలో 17 కన్సల్‌టేషన్ రూములు, 8 ఆపరేషన్ థియేటర్లు, 4 కేత్‌టర్ లేబోరేటరీలు, 76 స్పెషల్ వార్డులు, 96 సాధారణ వార్డులున్నాయి. న్యూరాలజీ విభాగంలో కూడా 17 కన్సల్‌టేషన్ రూములు, 4 ఆపరేషన్ థియేటర్లు, 134 పడకలున్నాయి. వైద్యశాస్త్రంలో సాధించిన అత్యంత అధునాతన శాస్త్ర సాంకేతిక విజ్ఞానం ఫలితాలను అందరికీ అందించాలనే ఉన్నతాశయంతో ఈ ఆసుపత్రి నిర్మాణం జరిగింది. ఇందులోని పరికరాలు అంతర్జాతీయ ప్రమాణాలకు ధీటుగా ఉన్నాయని డాక్టర్లు చెబుతున్నారు. పుట్టపర్తి ఆసుపత్రికన్నా, ఈ ఆసుపత్రిలో మరింత ఎక్కువమంది పేదలకు వైద్యం లభిస్తుందని నిర్వాహకులు చెబుతున్నారు

*With best compliments from :*



భగవాన్ సత్యసాయిబాబావారి ని పుష్పమాలాంకృతులను చేస్తున్న శ్రీ పి. సిద్దయ్య శెట్టి